


# ఐక్య ఉపాధ్యాయ

సంపుటి 7 ★ సంచిక 2 ★ ఫిబ్రవరి 1981




బడి విషయం ప్రక్కనపెట్టు – వెట్టిచాకిరికి నడుంకట్టు
కోళ్ళ, కుక్కల ఆరాలు – కిరోసిన్, పంచదార సమాచారాలు
ఓటర్ల, జనాభాలిస్టులు – ట్రాఫిక్, తుఫాను సేవలు....
ఎందుకలా బెదురుచూపులు చూస్తావు ? – ఇంకా ఎట్రాసిటీ కేసులు లేవూ ?

రు. 1

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక

THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY




పీడిత, తాడిత ఉపాధ్యాయుల బాసటనిల్చి చైతన్యకరదీపికగా పెంపొందుతున్న పత్రికకు జన్మదినోత్సవ సందర్భాన శుభాకాంక్షలు!

— యస్. చక్రపాణి, కల్వకుర్తి.

ఉపాధ్యాయ సమస్యలకే పరిమితంగాక, వాటి మూలకారణాలకు తేటపరుస్తూ సమసమాజ స్థాపనలో మనవంతు కర్తవ్యాన్ని ప్రబోధిస్తూ అందరి ఆదరాభిమానాలు పొందుతున్న మన పత్రికకు నా నూతన వత్సర శుభాకాంక్షలు!

— యస్. విష్ణుమూర్తి, ఎల్లికల్లు.

ఉపాధ్యాయుల ఊపిరిగా, ఉద్యమంద్వారా ఉత్తేజం కలిగిస్తున్న సంఘ వాణికి నా జేజేలు!

— వి. వెంకటేశ్వర్లు, తెనాలి.

జనవరి ముఖచిత్రం మన రాష్ట్ర మంత్రివర్గ భారాన్ని అద్దం పట్టింది. "సోవియట్ యూనియన్‌లో అనుభవాలు" వ్యాసం చదువుతుంటే మన దేశం ఆ స్థాయికి "ఎప్పుడు ఎదుగుతుందా!" అని అనిపిస్తుంది.

— యస్. కె. నాగమల్లేశ్వరరావు, భగ్గేశ్వరం.

ఆరు వసంతాల వయసుదాటి అభ్యుదయ పథంవైపు మరింత ముందుకుపోతున్న పత్రికకు నా శుభాకాంక్షలు.

— బి. మార్కొండయ్య, ఇందుగుల.

# నేస్తం!

— సుకృత, యం. నగర్ జిల్లా.

నేస్తం....!
ఆరు మైలురాళ్ళను - ఆరు వసంతాల్లో
అవలీలగా దాటేవు!
చెన్నుపాటి ఆశయాల వెలుగులో
సాటిలేని యు.టి.యఫ్. సారథ్యంలో
అప్రతిహతంగా పురోగమిస్తున్నావు!
ఉపాధ్యాయుల ఐక్యత నీ గమ్యం!
అధ్యాపకుల సంక్షేమం నీ లక్ష్యం!
నీ లక్ష్యం సిద్ధించి, నీ గమ్యం చేరిననాడు
దళారుల దమననీతులు
అవినీతి అధికారుల అక్రమాలు
కూకటివేళ్ళతో పెకలింపబడతాయి!
సజీవ సమాధి చేయబడతాయి!
అప్పటిదాకా మడమత్రిప్పకు!
అజేయంగా పురోగమించు!

# ప్రేమాంజలి!

— శ్రీ కూరపాటి శేషంరాజు, తల్లంపాడు.

జయ....జయ....జయ....జన్మసంచికా!
జయ....జయ... జయ....సత్యవేదికా!
ప్రగాఢమౌ నీ దీక్షాకంకణం
ప్రలోభులకేమొ మహాభయం!
ప్రచండమౌ నీ కాంతికిరణం
ప్రతి స్థలంబున శుభోదయం!
అందుకొనుము మా ప్రేమాంజలి!
అరుణారుణమౌ హృదయాంజలి!

# ఓ ఐక్య ఉపాధ్యాయా!

— శ్రీ సి. జానయ్య, నకిరేకల్.

పీడితోపాధ్యాయ వాణీ!
'ఐక్య ఉపాధ్యాయ' జననీ!
ఆరేళ్ళకే ఎంతో ఎదిగి
ఎందరెందరో ఎదలనిండావు!
బృహత్ లక్ష్యసాధనకై
నీ శాఖలు ఇరవై మూడుగ
విశాలాంధ్ర అంతట విండీ
పరిమళాల వెదజల్లావు!
నీ జీవిత మనుగడకు
నీరు పోస్తు, పాదుచేస్తు
నీ నీడనె ఉంటాము
నిన్ను కాపాడుకొంటాము!

# మా పత్రిక!

— శ్రీ గుర్రాల లక్ష్మారెడ్డి, కల్వకుర్తి.

సుందర ఐక్య ఉపాధ్యాయ పత్రికా!
మా అందరి అనుంగు పుత్రికా
వర్ధిల్లవమ్మా వర్ధిల్లు!
కలకాలం యిలవర్ధిల్లు!
మినీ కథల ఇంపుతో
మెనీ గేయాల సొంపుతో
వార్తా ప్రపంచం వేదితో
ప్రభుత్వ ఉత్తర్వుల వాడితో
గుసగుసల వాతలతో
పోరాటపటిమచాటు చేతలతో
మిథ్యా చీకటినిచీల్చి
మద్యదళారీల కూల్చి
సమరం సాగిస్తున్నావమ్మా!
అమరం నీ జీవితమమ్మా!

IKYA UPADHYAYA

Life Subscription 130-00
Yearly .. 12-00
Single Copy . 1-00

Ikya Upadhyaya
Palapartivari Street,
Vijayawada-2
520002

Grams: "UTIYEF" Phone : 63606

# ఐక్య ఉపాధ్యాయ



సంపుటి 7 ఫిబ్రవరి 1981 సంచిక 2

## సేవ - చాకిరీ!

సేవ వేరు....చాకిరీ వేరు
హృదయ పూర్వకంగా చేసేది సేవ !
పట్టుదలవంతంగా ఆదేశంగా చేయించేది చాకిరీ !
ఇంకా అది ముదిరితే వెట్టి చాకిరీ !

— ఉపాధ్యాయులపై.... ముఖ్యంగా ప్రాథమికోపాధ్యాయులపై మోపబడుతున్న భారాల్ని పరిశీలిస్తే.... అది చాకిరీ అని .... బండ చాకిరీ అని అనక తప్పటం లేదు.

పసిబిడ్డలకు విద్యా బుద్ధులు నేర్పే విలువయిన కాలమంతా ఆ చాకిరీలోనే వారికి హరించుకుపోతున్నది.

— ఓనెల పశువుల, పక్షుల, కుక్కల, నక్కల లెక్కలు.
మరోనెల ఇళ్ళ సంక్షిప్త జాబితా తయారీ
ఇంకోనెల రేషన్‌కార్డులు వ్రాయటం.... వెనుకబడిన జాతుల లెక్కలు తీయటం.

పంచాయితీ ఎన్నికలు, మునిసిపల్ ఎన్నికలపేరుతో జనవరి నెల ఓటర్ల లిస్టుల తయారీతో గడిచిపోయింది.

ఇక ఫిబ్రవరంతా జనాభా లెక్కలు !
అంతటితో అయిందా ?
ఈ బాదరబందీ నిర్వహణకు పక్షానికోసారి శిక్షణాతరగతులు !
నెలంతరబడి జీతాలందకపోయినా ... .... .... ఆ బాధలతోనే ఉపాధ్యాయులు ఈ బాధ్యతల్ని నిర్వహించాలి!
నిరాకరిస్తే తాఖీదులు .... వార్నింగులు .... శిక్షణాచర్యలు!
మళ్ళీ చదువులేదనే నింద ! పరీక్షాఫలితాలు రాలేదనే సంజాయిషీలు !

—ఇలా మద్దెలవాయింపు సామెత అవుతున్నది.... ఉపాధ్యాయుడికి అటూ.... యిటూ.

అంతేగాదు .... ఓటర్ల లిస్టుల తయారీలో అడుగడుగునా పెత్తందార్ల అదలింపులు.... బెదిరింపులూ !
చేయకపోతే ఓతంటా....చేస్తే మరోతంటా !
అంతా అరిటాకూ....ముల్లూ సామెత !
అడగ తెరలో పోకల్లా నలిగిపోయే దుస్థితి !
'ఇదంతా జాతీయ బాధ్యతట !
ఉపాధ్యాయులు తప్ప ఎవరూ చేయలేరట !'
— ఎంత విచిత్ర వాదన !
దేశంలో వేలాదిమంది విద్యావంతులైన నిరుద్యోగులున్నారు.




పై విషయాలలో వారికి శిక్షణనిచ్చి పని కల్పించవచ్చుగదా
ప్రత్యేకమైన డిపార్ట్‌మెంట్లు నెలకొల్పి ఉద్యోగకల్పన చేయవచ్చుగదా !

మనసుంటే అనేక మార్గాలున్నాయి.

కాని పాలకవర్గం ఆ పని చేయదు ....! ఆ ఆలోచనల్ని మనసులోకి రానీయదు. ఉపాధ్యాయులున్నారు గదా ఏ బరువు మోపినా మోయటానికి !

తమ బాధ్యతల్ని సక్రమంగా నిర్వహించటానికి వీల్లేని పరిస్థితి కల్పించటంవల్ల, విద్యారంగం ఎంత దెబ్బ తింటున్నదో యీ పాలక వర్గానికి అంతుపట్టినట్టు లేదు. దానివల్ల భావితరాలు ఎంత నష్టపడతాయో అర్థమైనట్టులేదు.

సేవ చేయాల్సిందే....కాని అది చాకిరీగా మారగూడదు.... ఆత్మగౌరవానికి భంగంగా తయారు కాగూడదు.

విద్యాభివృద్ధికి ఆటంకంగా ఉన్న యీ సంకటస్థితి తొలగాలనీ, ఈ చాకిరీకి ప్రత్యామ్నాయ మార్గాలు ఆలోచించి అమలు పరచాలనీ ప్రభుత్వాన్ని ఈ సందర్భంగా డిమాండ్ చేస్తున్నాం.

## ఓ ఉపాధ్యాయా!

ఒకరిద్దరు పిల్లలతో
తికమకయై, తల్లి తండ్రి తిప్పలుబడనీ
నూరు వందమంది పిల్లల
కకటా ! హితబోధ నెట్టులందితువయా !

కుక్కుటంబుల, పశువుల, లెక్కదీయ
క్రొత్త ఓటర్ల జాబితా కూర్పుసేయ
ప్రతి గృహానికి జని జనాభాను జేర్చ
పాలకుల దృష్టి నీపైన బడుగదయ్య !

మన సమస్యలు దీర్చగా మరి యొకండు
ఆకసము నుండి రాడు, సమైక్యమైన
మన ఉపాధ్యాయశక్తియే మనకు రక్ష !
లెండి! ముందుండి ఉద్యమించండి! రండి!

— శ్రీ మల్లవరపు జాన్, చీమకుర్తి.




# జనచైనాలో ఉద్యోగుల, కార్మికుల వేతనాలు - వారి స్థితిగతులు

జనచైనా పరిశ్రమలలో పనిచేసే కార్మికులకు 8 రకాల గ్రేడు లున్నాయి. పారిశుద్ధ్య కార్మికునికి తక్కువస్థాయి సాంకేతిక నిపుణు నికి జీతాలలో భేదం చాలా స్వల్పం. ఒక పరిశ్రమలో పనిచేసే కార్మికునికి మరొక పరిశ్రమలో పనిచేసే కార్మికునికి, లభించే జీతాలలో భేదముండదు. అతితక్కువ గ్రేడులో పనిచేయువారి నెలజీతం నెలకు రు. 170లు. అతిఎక్కువ నెలజీతము రు. 535. అతితక్కువ గ్రేడు, అతిఎక్కువగ్రేడు నెలజీతముల నిష్పత్తి 1:3.15

ధరవరల సంగతి చెప్పకుండా జీతాల గురించి చెప్పడం అర్థరహితం, ఇండియా శ్రామికుని కంటే చైనా శ్రామికుడు తక్కువ సంపాదిస్తాడు. కాని చైనా శ్రామికుని జీవనస్థాయి ఇండియా శ్రామికుని జీవనస్థాయికంటె ఎక్కువ. కార్మికుని జీతంలో ఎక్కువ భాగం ఖర్చుపెట్టవలసి వచ్చే అవసరాలు బియ్యం, కూరగాయలు, ఇంటిఅద్దె కరెంటు చార్జీలు, వంటచెరకు, సాధారణ పానీయాలు, రవాణా ఖర్చులు ఇవన్నీ అచట చాలాచౌక, 30-40 చదరపు మీటర్లుండే రెండు గదుల యింటిఅద్దె నెలకు 10-15 రూపాయలు. ఇవి అసౌకర్యంగా వుండే ప్రాంతాలలో వుండవు. పెకింగ్ నగరం మధ్యలో ప్రఖ్యాతమైన టియెన్ - అన్‌మాన్ స్క్వేర్‌లో గత రెండేళ్ళలో 8 అంతస్థుల భవనాలు వందలాదిగా కార్మికుల కొరకు నిర్మించబడినవి. కరెంటుకు, వేడినీటికిఅగుఖర్చువ్యక్తికి 50పైసలకు మించదు.

చైనా ప్రజలు అతిఎక్కువగా ఉపయోగించే క్యాబేజి కిలో ధర 60 పైసలు. బియ్యం కిలో రు. 1-50లు. రవాణాసౌకర్యాలు ట్రిప్‌కు రు. 7-10లు. సినిమా టిక్కెట్టు (అంతా ఒకటే క్లాసు) రు. 1-40లు ఇలాంటిధరలు అమలులో వుండడం వలన చైనా శ్రామికులు నిశ్చితంగా జీవనం సాగించగలుగుతున్నారు. కుమార్తె పెండ్లికి, వయసుమీరిన తల్లిదండ్రులకు తగునదుపాయాలు సమ కూర్చడం, చిన్నతమ్ముళ్ళు చెల్లెళ్ళ కలవలకు యింటికివచ్చినప్పుడు అదనంగా ఖర్చులుంటాయి. సాధారణంగా కుటుంబంలో యిద్దరు ముగ్గురు నెలజీతాలు తెచ్చేవాళ్లుంటారు. పని చేయనివారు జీతాలు తెచ్చుకొనని నయోజనులు దాదాపు లేరనేచెప్పాలి.

చైనాలో ద్రవ్యోల్బణ సమస్య లేదు. 20 సంవత్సరాలుగా ధరలు స్థిరంగా వున్నాయి. కాని 1979లో మాత్రం ద్రవ్యోల్బణ సమస్య 4.6% కల్పించింది. 1979లో చైనా ఉత్పత్తిని పెంచడానికి గాను సందిమాంసం, కూరగాయల రేట్లు కొద్దిగా పెంచింది. వెంటనే ఉద్యోగుల కొనుగోలుశక్తి పెంచడానికి వారి జీతాలు రు 25 లు పెంచడం జరిగింది. 1973 నాటి చిల్లర సరకుల ధరల పట్టీ నావద్ద వుంది. 1980లో బియ్యం, టీ, బ్లేడ్స్, టెలివిజన్ అన్నిటి విష లనుమ మరలా తెలుసుకుంటే ధరలలో పెద్ద తేడాలు లేవు. కొంత కొద్ది వస్తువుల ధరలు స్వల్పంగా పెరిగాయి. కాని చాలా ఎక్కువ వస్తువుల ధరలు 6 ఏళ్ళనాటికంటె తక్కువగా వున్నాయి.

పార్టీలో పనిచేసే రాజకీయ నాయకులు, మంత్రులు గవర్నర్లు, విప్లవ కమిటీలోని ఛైర్మన్ల పరిస్థితి ఏమిటి? అత్యంత ఉన్నతపదవి నిర్వహించే ఛైర్మన్ నుండి అతిసాధారణ గుమస్తా వరకు వీరిలో 11 గ్రేడులుండేవి. తరువాత వీటిని 30 గ్రేడులుగా విభజించారు. ఛైర్మన్ మావో - గ్రేడ్-1 ; చౌఎన్‌లై గ్రేడ్-2 : మంత్రుల గ్రేడ్స్ 4-8. సాధారణ గుమస్తాల గ్రేడ్స్ 18-26. ఇతరులు చివరి నాలుగు గ్రేడ్స్‌లో వుండేవారు. నేను గ్రహించి నంతవరకు వీటిలో యిప్పటికీ మార్పులేదు.

క్యాబినెట్ మంత్రులు ప్రాంతీయ విప్లవ కమిటీ ఛైర్మన్లు, సీనియర్ ప్రొఫెసర్ల నెలజీతం రు. 1550లు. అతి క్రిందిస్థాయి గుమస్తా నెలజీతం 250-400. ప్రభుత్వ కార్యాలయాలలో పనిచేసే డైరెక్టరు నెలజీతం రు. 500లతో లెక్చరర్‌కు రు. 350లతో, ఉపాధ్యాయునికి రు. 265లతో మొదలవుతుంది. వీరిలో అతి తక్కువ నెల జీతం అతి ఎక్కువ నెలజీతాల నిష్పత్తి 1:4 పారిశ్రామిక కార్మికులలో వీటి నిష్పత్తి 1:3.15.

పారిశ్రామిక కార్మికులు 60 రోజుల జీతం బోనసుగా పొందు తున్నారు. 1979లో కరువు పరిస్థితులు లేకపోతే మరొక 30 రోజుల బోనసు లభించివుండేది. ప్రభుత్వం కార్మికులందరికి తరువాత గ్రేడు యిచ్చింది. ఇది శ్రామికుల కొనుగోలు శక్తిని పెంచింది.

(డిసెంబర్ 2 ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ఎస్.ఎన్. చోప్రా వ్యాసంలో కొంతభాగానికి అనువాదం)

---

# శస్త్రచికిత్స

—శ్రీ యం. జ్ఞానసుందరరావ్, కాటూరం.

రాజకీయ రంగుల సమీరం
నవ విద్యా రంగం
ఎడారిలో సలిల ప్రయత్నం
మన పరీక్షా విధానం

నిద్రపట్టని అర్థరాత్రి లేచిన
హాజరుతోనే పైతరగతికెగిరే
ప్రగతిశీలక కానవాలకు
వాహనాలు
పబ్లిక్ పరీక్షా ప్రమాణాలు

మున్నూర్ల రోజుల శ్రమవాదిని
ముళ్ళ ప్రశ్నల స్టెతస్కోపుతో
పరీక్షించే డాక్టరు పట్టభద్రుడు—
అర్థకాంక్షా మహోద్వేగంతో
మరకల్లేకుండా చురకలువేసే
ఎగ్జామినరు — ఉమ్మడిగాచేసే
వైజ్ఞానిక శవపరీక్షా వ్యాపారానికి
ఉరిశిక్ష పడాలినేడు!
శస్త్రచికిత్స చేయాలినేడు!

సీరియల్ :

# నల్లచేప పిల్ల

— పవంద్ బెహరంపీ

(గత సంచిక తరువాయి)

ఎండ్రకాయ మాట్లాడటం ముగించి వెనక్కి ముందుకి ఊగుతూ, నాలుగు అడుగులు ముందుకువేసి పిల్లచేపను చేరుకుంది. దాని బలిసిన శరీరం చూడ ముచ్చటగావుంది. పిల్లచేప భయపడటం మానేసి నవ్వటం మొదలెట్టింది.

రాయిమీదకూర్చొనివున్న తొండవచ్చి, 'ఏమే ఎండ్రకాయ, ఎట్లావదవాలో ఈనాటివరకు నీకు తెలియదే, ఈ లోకం ఎవరిచేతుల్లో ఉందో నీకేం తెలుసు, అని వ్యంగ్యంగా అంది.

పిల్లచేప నాల్గడుగులు వెనుకకు తప్పుకోగానే నీటిమీద పొడుగాటి నీడ పడుతున్నట్లు గ్రహించింది. క్షణంలో గోధుమవర్ణం కలిగి లావుపాటి రెల్లుకాడవలెనున్న పొడవైన వస్తువొకటి ఎండ్రకాయను గట్టిగా అదిమిపట్టి నీటిఅడుగుభాగానికి నొక్కిపెంది. అట్లా నొక్కటంవల్ల అది క్రిందనున్నఇసుకలో పాతుకొనిపోయి ఒక్క అంగుళంకూడా ఇటు అటు కదలలేక పోయింది.

ఈ తమాషాను చూస్తున్న తొండ మైమరచి పిచ్చిగానవ్వడం మొదలెట్టి ది. క్షణంలో నీటిలో జారిపడేదే, కాని ప్రమాదం వెంట్రుక వాసిలో తప్పిపోయింది.

నల్లచేపపిల్ల తల ఎత్తిచూసింది. అక్కడో గొల్లపిల్ల నీటి ఒడ్డున మోకాళ్ళపై వంగికూర్చొని కనిపించింది. ఆమె చేతిలో ఒక పొడుగాటికర్ర ఉంది. ఆ గొల్లపిల్ల నల్లచేపపిల్లను చూసి చిరునవ్వు నవ్వింది. చేపపిల్లకూడా సమాధానంగా చిన్నవవ్వు నవ్వింది. మేకపిల్లలు, గొర్రెపిల్లలు గుంపులు గుంపులుగావచ్చి మెదలువంచి నీళ్ళు త్రాగుతున్నాయి. వాటి అరుపులతో లోయ అంతా మారు మ్రోగింది. అవి నీళ్ళుత్రాగి వెళ్ళేంతవరకూ ఆ నల్లచేపపిల్ల ఆశ్చర్యంతో కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోయింది, అంతటి అపూర్వమైన జీవులను అనాటివరకూ అది చూడనేలేదు.

గొల్లపిల్ల తన మందను తోలుకొనిపోయిన తరువాత, నల్లచేపపిల్ల తొండ వైపు తిరిగి అడిగింది. "తొండగారు నన్ను నల్లచేపపిల్ల అంటారు. నేనేమో ఈ ప్రవాహపు అంతు కనుక్కోవాలని బయలుదేరాను. మిమ్మల్ని చూస్తుంటే మీరొక గొప్ప మేధావిగాను, అనుభవ శాలిగాను కన్పిస్తున్నారు. మిమ్మల్ని ఒకమాట అడగాలను కొంటున్నాను"

"సరే, నీ ఇష్టమొచ్చింది అడుగు" అన్నది తొండ.

నల్లచేపపిల్ల ఇట్లా చెప్పడం మొదలెట్టింది, "ఒక తెలివైన నత్త ప్రేమతో ఓమాటచెప్పింది, 'చూడుఅమ్మాయీ నీవు జీవితంలో ఎప్పుడూ గూడ కొంగ (పెలికన్)ల నుండి, కత్తిచేపల నుండి, సముద్రపు కాకులనుండి చాలా జాగ్రత్తగా ఉండాలి, అని. మీకు వాటి గురించి ఏమైనా తెలుసా దయచేసి చెప్పరూ!"

"ఈ ప్రాంతాలలో కత్తిచేపలు సముద్రపు కాకులు కనిపించవు. కత్తిచేపలు ఎక్కువగా సముద్రపు నీటిలోనే ఉంటాయి. కానీ గూడ కొంగలంటావా అవి ఇక్కడికి దగ్గరలోనే కనిపిస్తాయి.




మూర్ఖంగా వ్యవహరించి దాని సంచిలోకి జారిపోవద్దు" తొండ హెచ్చరించింది.

"ఏ సంచీ?" పిల్లచేప అమాయకంగా అడిగింది.

తొండ చెప్పడం మొదలెట్టింది, "గూడ కొంగకు గొంతు క్రింది భాగంలో ఒక పెద్ద సంచి ఉంటుంది. అందులో ఎప్పుడూ నీళ్ళు నిండి ఉంటాయి. ఆ గూడ కొంగ నీళ్ళలో ఈదుకొంటూ పోతున్నప్పుడు సాధారణంగా నోరు తెరిచే ఉంచుతుంది అది తెలియక అమాయకపు చేపలు దాని సంచిలోకి జారిపోతూ ఉంటాయి. కొంతసేపటికి ఆ సంచిలో వర్ధ చేపలన్నీ పొట్టలోకి పోతాయి. అయితే గూడకొంగ ఆకలిగా లేనప్పుడు కొంతసేపటివరకు చేపలు ప్రాణంతో ఉంటాయి.

"పొరపాటున ఏ చేపైనా దాని సంచిలోకి పోతే బయటపడు దారే లేదంటారా?" భయపడుతూనే అడిగింది నల్ల చేప పిల్ల.

"దాని సంచిని చీల్చకుండా బయట పడేదారి మరొకటి లేనే లేదు" తొండ జవాబిచ్చి గబ గబా రాతి పగుల్లోకి దూరి బాకులాంటి చిన్న వస్తువొకటి తీసుకొని బయటికి వచ్చింది.

"దీనిని బాకు అంటారు. నీకిస్తున్నా తీసుకో దీనిని ఎప్పుడూ నీ దగ్గరే దాచిపెట్టుకో. ఖర్మకాలి గూడకొంగ సంచిలో చిక్కుకుపోయావనుకో దీని సహాయంతో తేలికగా బయటపడవచ్చు." బాకు నందిస్తూ అంది తొండ.

నల్లచేపపిల్ల బాకును సంతోషంగా అందుకొని తనరెక్కచాటున దాచుకొని, "తొండగారు, మీరు చాలా మంచివారండీ మీరుచేసిన మేలుకు ఏమని కృతజ్ఞత చెప్పాలో తోచటం లేదండీ" అంది.

"చూడమ్మాయి! ఇందులో కృతజ్ఞత చెప్పడానికి ఏముంది, నావద్ద ఇటువంటి బాకులెన్నో ఉన్నాయి. ఏమీ పనిలేనప్పుడు కూర్చొని నెమ్మదిగా చెట్లముళ్ళతో ఈ రకమైన బాకులను తయారు చేస్తూ ఉంటాను. నీవంటి తెలివైన చేప ఏదైనా తటస్థించిందనుకో, వానికో బాకు ఇస్తూ ఉంటాను." అంది, తొండ.

"అలాగా! అయితే ఈదారి నుండి వేరే చేపలు వెళ్ళాయా?" ఆశ్చర్యంగా అడిగింది ఆ నల్ల చేప పిల్ల.

"చాలా వెళ్ళాయి ఇప్పటికి అవి అన్నీ గుంపుగాచేరి జాలరిని బాగా ఏడ్పిస్తూ ఉండి ఉంటాయి" తొండ జవాబిచ్చింది.

"క్షమించండి, కానీ ఒక ప్రశ్న ఇంకొక ప్రశ్నకు దారి తీస్తుంది. నన్ను అల్లరి పిల్ల అని మీరు అనుకోకుంటే నేనొకటి అడుగుతా చెప్పండి. మీరేదో చెప్పాలన్నారే అని బెస్తవాణ్ని ఎట్లా ఏడిపిస్తాయండీ" కుతూహలాన్ని అణుచుకోలేక నల్ల చేప పిల్ల అడిగింది.

"ఏముంది అవి అన్నీ ఒకదానొకటి విడవకుండా ఉంటాయి. బెస్తవాడు వల విసరగానే అందులో చేపలన్నీ చిక్కుకుంటాయి. అవి తెలివైనవైతే అన్నీ ఇట్టుగా కలిసి వలను సముద్రపు అడుగు భాగానికి లాక్కొని వెళ్ళిపోతాయి" వివరించింది తొండ.

తొందర కొంతసేపు రాతి పగులుకు చెవి ఆనించిన "ఇక నేను వెళతానమ్మా పిల్లలు నిద్రలేచినట్లు ఉన్నారు," అని పలికిరాతి పగులు లోనికి దూరి అగుపించకుండా పోయింది. పాపం పల్లచేప పిల్ల మాత్రం ఒంటరిగా మిగిలిపోయి చేసేదిలేక తన ప్రయాణాన్ని సాగించింది. దారి పొడుగునా ఏవేవో ప్రశ్నలు తనకు తానే వేసు కొంటూ ముందుకు సాగిపోయింది.

"గూడకొంగ వాకన్నా బలమైనదే కావచ్చు. అయితే ఏమౌతుంది! తన వంశాన్ని తానే మింగటానికి తెగిస్తే మనమెలా ఒప్పుకుంటుందో? సముద్రపు కాకులు మాకు శత్రువులెట్లా అయ్యాయో?"

ప్రయాణం చేస్తున్న కొద్ది దాని ఆలోచనలు పెరుగుతూ పోయాయి. అడుగడుగునా క్రొత్త అనుభూతులను పొందుతూ పోయింది. ఏదో క్రొత్త లోకంలో అడుగు పెట్టినట్టే అనిపించింది. నీటి ప్రవాహంలో ఆనందంగా గెంతడం నేర్చుకొంది. సంతోషంగా ఈదుతూ పోయింది. సూర్యకిరణాలు వీపు తాకుతూ ఉంటే దానికి మహోత్సాహం కలిగింది.

ఒకచోట ఒక జింక నీటి ప్రవాహానికి దగ్గరగా నిల్చొని అదరా బాదరాగా నీరు త్రాగటం చూసింది.

"ఓ అందమైన ప్రాణీ! ఏమిటా తొందర" అని చేపపిల్ల ఆతృతతో అడిగింది.

"వేటగాడు నన్ను వేటాడుతున్నాడు. చూడు వాడెట్లా గాయపరిచాడో" జింక భయంతోనూ బాధతోనూ జవాబిచ్చింది.

జింకగాయాన్ని చేపపిల్ల చూడలేదు కాని అది కుంటుకుంటూ కుంటుకుంటూ వెళ్ళడం స్పష్టంగా చూడగలిగింది. ఏదో పెద్ద ప్రమాదమే జరిగి ఉంటుంది అని భావించింది.

మరోచోట కాబేళ్ళ గుంపులు గుంపులుగా మత్తుగాహాయిగా ఇసుకలో కూర్చొని ఎండకాగుతుండగా చూసింది. తూతూ పక్షుల (ప్రొత్రిర్జన్) మధుర గానం లోయ అంతటా మారు మ్రోగగా విన్నది. కొండ కాలువలోని పచ్చికలు వెదజిమ్మే సువాసనలు, నీటి తేమ రెండూగాలితో చేరిపోయి ఎంతో ఆహ్లాదాన్ని కలిగించాయి. మధ్యాహ్నం అయ్యేటప్పటికి ఈ చేపపిల్ల విశాలమైన లోయప్రాంతానికి చేరుకుంది. నదీ ప్రవాహంకూడా నెమ్మదించింది.

నిండుగా కదలిపోతున్న ప్రవాహం పల్లచేపపిల్లను ఆనంద డోలికలలో ముంచేసింది. తన లాంటి చేపలు గుంపులు గుంపులుగా కనిపించాయి. ఇల్లు విడిచిన తరువాత వాటిని చూడటం ఇదే మొదలు. చూస్తుంటే నువ్వు క్రొత్తదానిలాగా కనిపిస్తున్నావే; పరవాలేదు. అప్పటికే తన చుట్టూమూగిన చిన్నచేపలు అడిగినాయి.

'అవును. నేను ఈ ప్రాంతాలకు క్రొత్తదాన్నే చాలా దూరం నుండి వస్తున్నాను.' పల్ల చేపపిల్ల సంతోషంగా బదులు పలికింది.

'నువ్వెక్కడికి పోవాలనుకుంటున్నావు?' అడిగిందో బుల్లి చేప.

'నేను ఈ సెలయేటి అంతును చూడాలని పోతున్నాను.' పల్ల చేప పిల్ల ఆగకుండా చెప్పింది.

'ఏ సెలయేరూ?' అన్ని చేపలూ ఒక్కసారే అడిగాయి.

'మనం ఈదులాడుతున్నామే, ఇదే'.

'ఓహో, ఇది సెలయేరు కాదు దీనిని మేము నది అంటాము. అందోచిరుచేప.

ఆ పల్లచేప పిల్ల ఇంకేమీ మాట్లాడలేదు.

# "చెట్టుకు మించిన గాలి"

(వచన కవిత) శ్రీ డి. యస్. శర్మ.

ఇన్కం టాక్సు వాళ్ళెప్పుడు దాడిచేస్తారో అనే 'వర్రీ' తో మందేసి విచారిస్తున్నాడొక షష్టి మిలియనీర్;

కార్మికులకు బోనస్ఎగ్గొట్టడం ఎలాగనే దూహాలోచనతో ఖరీదయిన బార్లో ఆరారగా బీరుకొడుతూ బుర్ర పాడుచేసుకుంటున్నాడొక ఇండస్ట్రీ ఓనర్;

తన 'కుర్చీ' కెవడన్నా ఎసరు పెడ్తేస్తున్నాడేమో అని చూసుకోవడానికి రెండుకళ్లూ చాలక సతమతమయిపోతున్నాడో మంత్రివర్యుడు;

కల్పవృక్షంలా కోరింది సమకూర్చే 'సీటు', పెద్ద పెద్ద సొరుగులున్న 'బల్ల' వీటినొంది బదిలీకాకుండా అయినవాళ్ళనీ, కానివాళ్ళనీ, అడ్డమయినవాళ్ళనీ కాకాపట్టి బాకాలు వూదేస్తూ అలసిపోతున్నాడొక ఆఫీసరు;

అవతల పార్టీపాడు చెయ్యమన్న పనిచేస్తే యిచ్చేది వందో మున్నూటికో అంచనా వెయ్యలేక; బాస్కి తెలిసి వటాకొస్తే ఎంతివ్వాలో తేలక తలబద్దలు కొట్టుకుంటున్నాడో గుమస్తా. హస్తం యిచ్చి పుచ్చుకొన్న ఇంక్రిమెంట్తో కలిపివచ్చే నెంజీతంతో కుటుంబ బడ్జెట్ కుదించలేక, యీ నెల కూడా అప్పుకెళ్ళక తప్పదురా దేవుడా అని కుదేలవుతున్నాడో బడి పంతులు.

ఎంత చెట్టుకు అంతగాలి – అంటే ఆదోటారి; చెట్టుకు మించిన గాలేస్తే గోదారే మరి!

పై క్రమంలో ఆర్థికంగా అంతా ఒకమెట్టు పైనేవున్నారు. అవును మరి.... బ్రతుకు తెరువు దగ్గరి కొచ్చేకల్లా పైవాళ్ళంతా, ఆక్రమిస్తారు పెద్ద పెద్ద సీట్లు. బడుగు పంతుళ్ళకు మాత్రం రిజర్వ్ అడుగు మెట్లు!

---

'చూడూ ఈ దారిలో గూడకొంగ ఉ దంటారు. ఆ సంగతి నీకేమైనా తెలుసా?' మరో చిట్టిచేప అడిగింది.

'ఆహ, నాకు బాగా తెలుసు' అన్నదా చేపపిల్ల.

'గూడకొంగకు ఓ పెద్ద సంచి ఉంటుందంటారు. ఆసంగతి కూడా నీకు తెలుసా'. అన్ని చేపలు ఒకేమారు అడిగాయి.

'ఆ! ఆ సంగతి కూడా నాకు బాగానే తెలుసు'. జంకు లేకుండా పలికింది పల్లచేప పిల్ల.

'అయితే, ఇవి అన్నీ తెలిసి కూడా ఎందుకు ముందుకు పోతున్నావు?' ఓ చిరుచేప కుతూహలాన్ని ఆపుకోలేక అడిగింది.

'అవును పోతాను, ఏదిఏమైనా సరే ముందుకు పోతాను' దృఢంగా చెప్పింది పల్లచేపపల్ల.

పల్ల చేపపిల్ల చాలా దూరం ప్రయాణంచేసి వచ్చిందనీ, ఈ నది అంతును చూడడానికి బయలుదేరిందనీ, దానికి ఎవరన్నా భయంలేదనీ చివరకు గూడకొంగకు కూడా భయపడటం లేదన్న వార్త క్షణంలో ఆ చేపల గుంపులో పాకిపోయి ది.

దాని మాటలు విని ఉత్తేజం పొందిన కొన్ని చిన్నచేపలు దానితోవెళ్ళాలని ఉబలాటపడ్డాయి. కాని తమతల్లిదండ్రులు కోప్పడతారో ఏమోఅని మౌనంగా ఉండిపోయాయి. "గూడకొంగలేకుంటే మేముకూడా నీతో వచ్చేవాళ్ళమే కాని మాకు దాని సంచి జ్ఞాపకం వస్తేనే భయమేస్తుంది" అన్నదొక చిన్నచేప. —— సశేషం.




## శనిగ్రహ విశేషాలు

సేకరణ ఎ. సత్యప్రసాద్.

—1543 లో పోలెండు దేశస్తుడు కోపర్నికస్ సూర్యుడు కేంద్రంగా మొత్తం అన్ని గ్రహాలు పరిభ్రమిస్తున్నాయని తెలియ చేశాడు.

— గ్రహాలలో పెద్దది గురుగ్రహం. తర్వాతి స్థానం శని గ్రహానిది.

— సూర్యుని నుండి భూమి దూరం 9 30,00 000 మైళ్లు. సూర్యుని నుండి గురుగ్రహ దూరం 48,30,00 000 మైళ్ళు. సూర్యుని నుండి శనిగ్రహ దూరం 88,68,00,000 మైళ్ళు.

— సూర్యుని కేంద్రంగా పరిభ్రమిస్తున్నందున వీటి పరిభ్రమణ కాలాలు వేర్వేరుగా ఉన్నాయి. భూమి పరిభ్రమణ కాలం 365 రోజులు. మన కాలమాన ప్రకారం గురుగ్రహానికి 12 సంవత్సరాలు, శనిగ్రహానికి 29 సంవత్సరాలు పరిభ్రమణకాలం పడుతుంది.

— టెలిస్కోపు సహాయంతో చూస్తేనే యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో గ్రహాలు కన్పిస్తాయి.

— 1973లో పయొనీర్ 10, 1974లో పయొనీర్ 11 లను అమెరికా అతిదూర పరిశోధనకై ప్రయోగించింది. ఇందువల్ల గురుగ్రహానికి అతిధార్మిక శక్తి వలయాలు, ఆకర్షణశక్తి ఉన్నట్లు తేలింది.

— మరింత పటిష్టమైన విషయశోధనకై అమెరికా 1977 ఆగస్టులో 1 వాయిజర్‌ను, 1977 సెప్టెంబర్‌లో వేరొక వాయిజర్‌ను ప్రయోగించింది.

— ఇవి గంటకు అరవై వేల మైళ్ళ వేగంతో ప్రయాణించే వ్యోమ శకటాలు రెండూ ఫ్లోరిడాలోని కేప్ కెనవరాల్ నుండి ప్రయాణం ఆరంభించాయి.

— వచ్చే ఆగస్టుకి వాయిజర్-2 శనిగ్రహం చేరుతుంది. 1986లో యూరేనస్‌ను, 1989లో నెప్ట్యూన్ కూడా ఈ శకటం సమీపిస్తుంది.

— వాయిజర్ - 1 1980 లో (నవంబర్) శనిగ్రహాన్ని సమీపించి అద్భుతమైన సమాచారాన్ని, ఫొటోల్ని అందచేసింది.

— సూర్యునిచుట్టూ పరిభ్రమించే గ్రహాలలో పెద్దదైన గురు, శని, యురేనస్, నెప్ట్యూన్ గ్రహాలు ప్రతి 175 సం॥ లకు

## సోదరా! కళ్ళు తెరు!

— కర్రా కార్తికేయశర్మ, ఊట్ల.

ప్రైవేటు కాలేజీ కమిటీలు
అధ్యాపకుల జీవితాలతో చెలగాటమాడే
మూర్ఖ మార్జాల సమూహాలు!
వాటి చెలగాటానికి ఎందరో ఎందరెందరో
ప్రాణాలను, మానాలను
పణంగా అర్పించుకొన్నారు
'కళ్ళపై సంతకం పెట్టేటప్పుడు చూసిన
వందల సంఖ్య జీతం
జేబులోకి వచ్చేసరికి పగానికి చిక్కిపోగా
ఆకలితో అవులించే సంసారాన్ని
తృప్తిపరచడానికి ఏ మార్గం కనబడక
కడుపునుండి తిరగబడితే
ఫలితం సవినుండి తొలగింపు
రకరకాల వేధింపు?
రాజీపడితే ఆ అధ్యాపకుడి జీవితం
గానుగెద్దుకో ఉపమానం
దీనికి పర్యవసానం ఏమిటి?
ఉరిపోసుకు చనిపోవడమా?
సముద్రమున పడిపోవడమా?
కాదుకాదు కానేకాదు
హక్కుల పోరాటానికి - న్యాయానికి
"ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్"లో
ఒకడుగా మారడం!
అందుకే దగాపడే ఓ సోదరులారా!
ఇకనైనా కళ్ళు తెరవండి!

---

అలమూరు సెంటర్ (ప.గో) : సెంటర్ శాఖకు అధ్యక్షుడుగా శ్రీ యం. సత్యనారాయణరాజు, కార్యదర్శిగా శ్రీ డి. సూర్యారావు మరి 6 గురు కార్యవర్గ సభ్యులు ఎన్నికయ్యారు.

వెలుగోడు : రాష్ట్రీ రజతోత్సవాల సందర్భంగా ఆత్మకూరు సమితి ఆధ్వర్యంలో నిర్వహింపబడిన ఉత్తమ పాఠశాలల పోటీలో వెలగోడు, ప్రాథమిక పాఠశాల (మెయిన్) ప్రథమ బహుమతి పొందింది.

---

వేర్వేరు కక్ష్యలలో ఉన్నా ఒకే సరళరేఖకి వస్తాయి. ఆ సమయంలో ఏదైనా వ్యోమశకటాన్ని ప్రయోగిస్తే అది ఆ నాలుగు గ్రహాల సమీపంనుంచి పయనించి తీరాలి. ఆ ఆలోచనే ఈ పరిశోధనకు దారితీసింది.

— దాదాపు 50 కోట్ల వ్యయంతో రూపొందిన వాయిజర్-1 శకటంబరువు కేవలం 1టన్ను మాత్రమే.

— ఈశకటం నడిపేందుకు, శకటంలోనే ప్లుటోనియం పై ఆధారపడి పనిచేసే ఒక అణు విద్యుత్ కేంద్రం ఏర్పాటుచేశారు. అణు ధార్మిక విశ్లేషణంవల్ల ఉత్పత్తిఅయ్యే ఉష్ణాన్ని ఈ కేంద్రం విద్యుత్తుగా మారుస్తుంది. తన ప్రయాణదిశ మార్పుకి 16 చిన్న పరికరాలు ఆ శకటంలోనే వున్నాయి.

# విద్యారంగం - పరీక్షల సంస్కరణ

## హైదరాబాద్ సెమినార్ చర్చల సమీక్ష

ఈనాటి విద్యావిధానం, పరీక్షావిధానం సమూలంగా మార్చవలసిందనే అభిప్రాయం సర్వేసర్వత్రావుంది. పరీక్ష పత్రాలలోని ప్రశ్నలు బయటకి పొక్కుతుండటం, పరీక్షఫలితాలు ప్రకటించడంలో అవకతవకలు, పరీక్షలు నిర్వహించే ఉపాధ్యాయులను విద్యార్థులు అవమానించడం లాంటి పరిస్థితులవలన విద్యాశాఖకు పరీక్షలు నిర్వహించడం నానాటికి గడ్డుసమస్యగా పరిణమిస్తున్నది. ప్రస్తుతం అమలులోవున్న విధానాన్ని మార్చడానికి ప్రభుత్వం ఏమేరకు సిద్ధమవుతుందో చూడాల్సివుంది.

జనవరి 3, 4 తేదీలలో హైదరాబాద్‌లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అఖిలభారతస్థాయిలో విద్యారంగంలో సంస్కరణలు, పరీక్షల నిర్వహణపై సదస్సు నిర్వహించింది. దేశం నలుమూలల నుండి విద్యావేత్తలు వచ్చారు. పుస్తకాలు చూచి పరీక్షలు వ్రాసే విధానం, అంతర్గత పరీక్షలు నిర్వహించి విద్యార్థిఅభివృద్ధిని అంచనా గట్టడం, ఇప్పుడున్న మార్కుల పద్ధతికి మారుగా గ్రేడ్ పద్ధతిని ప్రవేశపెట్టడం లాంటి విషయాలపై భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేశారు.

ప్రముఖ విద్యావేత్తలు వారివారి అభిప్రాయాలను నిర్దిష్టంగా వ్యక్తం చేసినప్పటికి సదస్సుకు వచ్చిన ఉపాధ్యాయ ప్రతినిధులు, విద్యార్థి సంఘాలు, ఉపాధ్యాయ కౌన్సిలర్లు, విద్యాశాఖాధికారులు ఏ ఒక్క విషయంలోనూ ఏకాభిప్రాయానికి రాలేకపోయారు.

పాఠశాల విద్యా డైరెక్టరు శ్రీ పి. ఆదినారాయణగారు మాట్లాడుతూ "పాఠ్య విషయాలపై సరియైన అవగాహన లేకుండ విద్యార్థులు కంఠస్థం చేయడాన్ని ప్రోత్సహిస్తోంది ప్రస్తుత పరీక్ష విధానం. పరీక్షలంటే విద్యార్థులు భయపడే వాతావరణాన్ని కలిగిస్తున్నది. కాపీ కొట్టడాన్ని ప్రోత్సహిస్తున్నది. తద్వారా విద్యార్థులలో క్రమశిక్షణారాహిత్యానికి కారణమవుతుంది. సంవత్సరం పొడుగునా విద్యార్థి నేర్చుకునే విషయాలంతగా పట్టించుకోనకుండ సంవత్సరాంతంలో జరిగే పరీక్షలకు విపరీతమైన ప్రాధాన్యతనిస్తున్నారని విమర్శిస్తూ 'పుస్తకాలు చూచి పరీక్షలువ్రాసే విధానం అనవసరమైన విషయాలన్నిటినీ జ్ఞాపకముంచుకొనవలసిన భారాన్ని విద్యార్థికి తగ్గిస్తుంది. పరీక్ష విధానాన్ని సమగ్రమైన విధానంగా రూపొందించడమేగాక విద్యార్థి క్రమబద్ధంగా చదివే అలవాటును ప్రోత్సహిస్తుంది. పరీక్షలంటే విద్యార్థికి వుండే భయాన్ని పోగొడుతుంది. విద్య కేవలం సమాచారాన్ని అందించేదిగానేగాక విద్యాబోధన - విద్యార్జనా విధానాన్ని, విద్యార్థి సామర్థ్యాన్ని పెంచి వాని జీవితాన్ని చక్కదిద్దుకొనేవిధంగా రూపొందిస్తుంది" అన్నారు.

పుస్తకాలుచూచి పరీక్షలు వ్రాసే పద్ధతికి తగిన నమూనా ప్రశ్న పత్రాలను తయారుచేయించి ఉపాధ్యాయులకు విద్యార్థులకు సరఫరా చేసిన తరువాత ఉపాధ్యాయులకు క్రొత్త విధానంలో తగు శిక్షణ యిచ్చిన తరువాత మాత్రమే ఈ విధానాన్ని ప్రవేశపెట్టవలసియుంటుందని జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ ప్రొఫెసర్ శేషాద్రి నాయకత్వంలోని ఉపసంఘం అభిప్రాయపడింది. విద్యార్థి అభివృద్ధిని నిర్ణయించే అంతర్గత పరీక్షలలో సగంపరీక్షలు ఈ విధానాన్ననుసరించి మిగిలిన సగం పరీక్షలు యిప్పుడమలులో వున్న విధానాన్ననుసరించి జరిపితే బాగుంటుందని ఉపసంఘం సలహా యిచ్చింది.

ఆంధ్ర యూనివర్సిటి వైస్‌ఛాన్సలర్ నాయకత్వంలో నున్న ఉపసంఘంలోని అధిక సంఖ్యాకులు సెమిస్టర్ పద్ధతిని, అంతర్గతంగా పరీక్షలు జరిపే పద్ధతిని వ్యతిరేకించారు. పరీక్షలు జరిపే ఉపాధ్యాయులకు, అధికారులకు ప్రభుత్వం తగు రక్షణ కల్పించాలని వీరు అభిప్రాయపడ్డారు.

నాన్‌డిటెన్షన్ విధానం ప్రకారం వార్షిక పరీక్షలలో గాని యితర పరీక్షలలో గాని వచ్చే మార్కులతో సంబంధం లేకుండ విద్యార్థి 80% హాజరయితే పైతరగతికి పంపబడుతున్నాడు. విద్యార్థికి చదవడంఅంత అవసరంగా కన్పించడం లేదు పై తరగతికి పంపబడనే భయంలేదు. తల్లిదండ్రులకు తమ పిల్లలు పరీక్షలు తప్పుతారనే ఆందోళనలేదు. నానాటికి విద్యార్థి క్రమబద్ధంగా చదువుకునే అలవాటుకు దూరమవుతున్నాడు. కాబట్టి డిటెన్షన్ విధానాన్ని, పునరుద్ధరించాలని ఉపసంఘం అభిప్రాయపడింది.

గ్రామీణ ప్రాంతాలలోని తెలివైన విద్యార్థుల కొరకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నడుపుతున్న గురుకుల విద్యాలయాలను గురించి ఆసక్తికరమైన చర్చ జరిగింది. విద్యార్థులలో కొందరికి మాత్రమే ప్రత్యేకవసతులుకల్పించి నిర్వహించబడుతున్న గురుకుల విద్యావిధానం సంకుచితమైనదని, ప్రజాస్వామ్య విరుద్ధమైనదని విధానమండలి సభ్యులు శ్రీ యం. జె. మాణిక్యారావుగారు విమర్శించారు. శ్రీ వి. పి. రాఘవాచారిగారు. శ్రీ ఎ. శ్యామసుందరరావుగారు ఈ పాఠశాలల విధానాన్ని సమర్థిస్తూనే వీటిని ప్రైవేటు సెక్టరు ఆధ్వర్యంలో నడపడాన్ని వ్యతిరేకించారు.

సదస్సులో తక్కువ ఉపసంఘాలు పాల్గొనినా వారిసంఖ్య తక్కువగా వుంటే యింతకంటె ప్రాముఖ్యంగల విషయాలపై చర్చలు సాఫీగా సాగివుండేవి.

జూనియర్ లెక్చరర్స్ అసోసియేషన్ అధ్యక్షులు శ్రీ యస్. డి. సుబ్బారెడ్డిగారు ఇంటర్‌మీడియట్ బోర్డును తీవ్రంగా విమర్శించారు. ఇంటర్‌మీడియట్ బోర్డును రద్దుచేయాలన్నారు. తరువాత విద్యార్థి ప్రతినిధి బోర్డును రద్దుచేయనవసరములేదని దానిని నాలుగైదు భాగాలుగా విడగొట్టాల్సిన అవసరం వుందన్నారు.

వివిధమైన ఉపసంఘాలు చేసిన వివిధమైనసిఫార్సులను ఎలా సమన్వయపరచాలనే చర్చ జరిగింది.

ఇవన్నీ వేరువేరు దృక్పథాలనీ, వీటిని సదస్సు సిఫార్సులుగా గాని తీర్మానాలుగాగాని పరిగణించరాదని ఈదృక్పథాలను ప్రభుత్వం నిర్ణయాలు తీసుకోబోయేముందు పరిగణనలోనికి తీసుకోవాలని జవహర్‌లాల్ యూనివర్సిటీ ప్రొఫెసర్ రషీద్దీన్‌ఖాన్‌గారు సూచించారు.

ఈ దృక్పథాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విద్యాశాఖ మాత్యులు పరిశీలించవలసివుంది.

"దేశంలో జాతీయశీలం మెరుగుపడితే తప్ప విద్యారంగం బాగుపడదు. అసలు విద్యాసంవత్సరానికి మొదలు చివరా లేకుండా పోతున్నది. విద్యా సంవత్సరాన్ని కట్టుదిట్టంచేయాలి సంవత్సరానికి 240 పనిరోజులుండాలి. బయట పరిస్థితుల ప్రభావం విద్యాలయాల మీద ఎక్కువగా పడుతుంది"

"ఉపాధ్యాయుడు చదువు చెప్పాలనే, విద్యార్థి నేర్చుకోవాలనే ఆసక్తి వున్నంతవరకు ఎలాంటి సమస్యలు ఉత్పన్నం కావు."

—ఇలా క్రమశిక్షణారాహిత్యాన్ని గురించిన కొన్ని సూచనలు ప్రముఖ విద్యావేత్తలనుండి వచ్చాయి. ఇదీ ఆ సెమినార్‌లో జరిగిన చర్చల సారాంశం.

అరాచక పరిస్థితులు, అస్తవ్యస్త పరిస్థితులు ఎందుకేర్పడుతున్నాయనే మౌలికమైన విషయాలలోకిపోకుండ, ఎందుకేర్పడిందో ఏర్పడింది. ముందు దాన్ని అణచివేయాలని ప్రభుత్వ నిర్వాహకులాలోచించడం అంత ఆశ్చర్యాన్ని కలిగించదుగాని విద్యావేత్తలాలోచించకపోవడం శోచనీయం!

అనునిత్యం పుంఖానుపుంఖంగా వెలువడే డిటెక్టివ్‌సాహిత్యం, సెక్స్‌సాహిత్యం- హీరోయిన్‌కు బట్టలుతొడిగే హీరో నిలువెత్తు ఫొటోలు- చెవులు పగిలిపోయేటట్లు రాత్రింబవళ్ళు వినిపించే రెండర్థాల సినిమాల బూతుపాటలు- సెక్స్, క్రైం, సస్పెన్స్, థ్రిల్లింగ్‌లు తగుపాళ్ళలో మేళవించిన సినిమాలు- బజారుకొక బార్ - బజారుకొక హోటల్ హౌస్ - బజారుకొక జూద గృహం— యిత్యాదులన్నీ ఎక్కడున్నాయి? సమాజంలోనే గదా! ఈ విద్యార్థులు ఉపాధ్యాయులెక్కడివారు? ఈ సమాజంలోనివారే.

చెప్పే విషయాలకంటె కన్పించే వాటిపైననే ఆకర్షణ ఎక్కువ. సమాజానికి విద్యాలయాలకు మధ్య అడ్డుగోడలు కట్టడం సాధ్యంగాదు. విద్యార్థులను యువకులను ప్రక్కదారి పట్టకుండా చూడాలంటే పైన చెప్పిన అనాచారాలకు సమాజంలో స్థానంలేకుండా చేయాలి. ప్రభుత్వం చిత్తశుద్ధితో కృషిచేస్తే యిది అసాధ్యం కాదు....

విద్యారంగానికి సంబంధించిన పలుఅంశాలలో పరీక్షలు జరపడం ఒకటి మాత్రమే. పాఠ్యవిషయాలు, బోధన, బోధనోపకరణాలు, ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి, చదువుచెప్పడానికి నేర్చుకొనడానికి తగు స్థితిగతులు మొదలైన అంశాలన్నీ చూడాలి. శాస్త్రీయ దృక్పథంతో పాఠ్యాంశాలు ఎంపిక చేయాలి. తరగతి కొక గదిలేకపోతేపోయింది. తరగతికొక పాక అయినా ఏర్పాటుచేయాలి. ఉపాధ్యాయ విద్యార్థినిష్పత్తి కనీసం 1:30 వుండేటట్లు చూడాలి. హైస్కూల్సులో అదనపు సెక్షన్స్‌కు అదనపు ఉపాధ్యాయులను నియమించాలి. సెక్షనుకు 80,90 కొన్ని పాఠశాలలలో 100కుమించి విద్యార్థులుంటున్నారు. ప్రాథమిక పాఠశాలలలో ఒక గదిలో ఐదు తరగతులు, ఐదుతరగతులకు ఒకరిద్దరు ఉపాధ్యాయులుండడం సర్వసామాన్యం.

ఈ పరిస్థితులను పరిష్కరించవలసిన అవసరం ఎంతైనా వుంది. వీటిని వదిలిపెట్టి బ్రిటీషు పద్ధతిలో పరీక్షలు జరపడమా లేక అమెరికాపద్ధతిలో పరీక్షలు జరపడమా అని చర్చించడం హాస్యాస్పదంగావుంది.

విద్యారంగానికి సంబంధించిన సంస్కరణలు - సూచనలు ఎవరినుండి పొందాలి? యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్లు, విద్యాశాఖ డైరెక్టర్లనుండా? లేక విద్యార్థులతో అనునిత్యం సంబంధాలుండే ఉపాధ్యాయులనుండా? సదస్సులో సమావేశమైన విద్యావేత్తల మేధాశక్తిని శంకించటం గాదుకాని విద్యార్థులతో ప్రత్యక్ష సంబంధం లేనివారు ఊహాజనితమైన సమస్యలు - వాటి పరిష్కార మార్గాలు చర్చించటం సహజం. అంతకంటే జిల్లావిద్యాశాఖాధికారులు జిల్లాల నుండి విద్యారంగాన్ని ఎదుర్కొంటున్న సమస్యలు-పరిష్కార మార్గాలను ఉపాధ్యాయులతో చర్చించిన తరువాత వీటిని దృష్టిలో పెట్టుకుని రాష్ట్రస్థాయి చర్చలు జరిపితే సరిఅయిన పరిష్కారాలు సాధ్యమవుతాయిగాని క్రిందిస్థాయి విద్యాబోధనతో ప్రత్యక్షసంబంధం లేనివారితో ఒకటి రెండు రోజుల సదస్సు ఏర్పాటు చేయడం వలన మొన్నటిసదస్సులో జరిగినట్లు ఎవరిఅభిప్రాయాలు వారు ప్రదర్శించుకొనడానికి దోహదపడతాయి తప్ప మరే ప్రయోజనాన్ని సాధించలేవు. అచటి చర్చలలో ఏఒక్క విషయంపై కూడా ఏకాభిప్రాయానికి రాలేకపోవడం గూడా స్వాభావికమే.

విద్యార్థులు డిగ్రీలు, డిప్లొమోలు పొందిన తరువాత వారి బ్రతుకులు వారు బ్రతకగలరనే విశ్వాసం కలిగేవిధంగా వుంటే వారు బాధ్యతాయుతంగానే ప్రవర్తిస్తారు. వారి చదువు పూర్తిఅయిన తరువాత ఈ పని వారితో చేయించాలనేధ్యేయం ప్రభుత్వానికి వుండాలి. గమ్యం, లక్ష్యం, ధ్యేయంలేని విద్యావిధానం అరాచకానికే దారితీస్తుంది.

కాబట్టి సోషలిస్టు సమాజస్థాపన ధ్యేయంగా ప్రకటిస్తున్న ప్రభుత్వం ఆ సమాజానికనువైన పాఠ్యాంశాలను శాస్త్రీయ దృక్పథంతో రూపొందించాలి సాంకేతికవిద్య, వృత్తివిద్య విద్యార్థి ముగించేటప్పటికి అతడు చేయవలసిన పని కేటాయింపబడి వుండాలి. సమాజానికి ఉపయుక్తమైన విద్య అమలులోవున్నప్పుడు పరీక్షలెలా జరపాలనేది సమస్యేకాదు. విద్యాసంస్కరణలు సోషలిస్టు విధానానికనువైన రీతిలో జరగాలి. సూచనలు అభిప్రాయాలు క్రిందిస్థాయి నుండి సేకరించగలిగినప్పుడే సరియైనపరిష్కారాలు లభిస్తాయి.

# కటక్ సెమినార్

ప్రపంచ వ్యాపిత ఉపాధ్యాయ సంఘాలు ప్రసిద్ధిచెందినవి రెండున్నాయి. మొదటిది 'యఫ్.ఐ.యస్.యి.', రెండవది 'డబ్ల్యు. సి.ఒ.టి.పి.'. మొదటిది సోషలిస్టు దేశాల మద్దతుతో నడుస్తున్నది. రెండోది పెట్టుబడిదారీదేశాల మద్దతుతో నడుస్తున్నది. భారతదేశంలో కొన్ని సంఘాలు రెండింటికి అనుబంధింపబడి యున్నవి. కొన్ని వేరువేరుగ అనుబంధింపబడియున్నవి. యు. టి. యఫ్. 'ఫిసే' లో చేరుటకు దరఖాస్తుచేసింది. ఈ సంఘాల ఆధ్వర్యాన అప్పుడపుడూ యిటువంటి సెమినార్లు జరుగుతుంటాయి.

కటక్ సెమినార్‌లో మన ప్రతినిధిగాక ఆంధ్రప్రదేశ్‌కు చెందిన వివిధ సంఘాలనుండి ఇంకా 6 గురు ప్రతినిధులు పాల్గొన్నారు. ఆస్ట్రేలియా, బంగ్లాదేశ్, ఆఫ్ఘనిస్థాన్, వియత్నాం, మలేషియా, శ్రీలంక, రష్యా, తూర్పుజర్మనీలనుండి యీ సెమినార్‌కు ప్రతినిధులు వచ్చారు. మనదేశంలో మద్రాసు, కర్ణాటక, ఆంధ్ర, మహారాష్ట్ర, హర్యానా, ఢిల్లీ ఉత్తరప్రదేశ్, బీహార్, వ బెంగాల్, ఒరిస్సా, రాజస్థాన్ రాష్ట్రాల నుండి దాదాపు 100 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. (వివరాలు తర్వాతి సంచికలో)

---

సవరణ: జనవరి పత్రికలో పెనుమంట్ర సమితిశాఖ(ప.గో) అను శీర్షికలో పెనుగొండ సెంటరులో యు. టి. యఫ్. అభ్యర్థి శ్రీ జి. భాస్కరరావుగారు 28 ఓట్ల మెజారిటీతో సెక్రటరీగా ఎన్నికయినారు; ఏలేటిపాడు సెంటరులో శ్రీ సత్యనారాయణమూర్తిగారు సెంటరు సెక్రటరీగా ఏకగ్రీవముగా ఎన్నికయినారు అని సవరించవలెను.

# తామే తుమ్మటం...తామే 'చిరంజీవ' అనుకోవటం!

## హైదరాబాద్ సదస్సులో సాగిన ప్రహసనం

'పాఠశాలలు పశువుల పాకలకంటె హీనంగా వున్నాయి. పాఠశాలలలో విద్యార్థులను నమోదు చేయడం నానాటికి పడిపోతున్నది. రాష్ట్రంలోని పాఠశాలల నన్నిటినీ తనిఖీ చేయడానికి 8 సంవత్సరాల కాలం పడుతుంది. రాబిన్‌హుడ్‌ని గురించి చెప్పడం జరుగుతుందిగాని భారతదేశచరిత్ర సంస్కృతిని గురించి చెప్పడం లేదు ?'

— ఈ ఉపన్యాసాలు ప్రతిపక్ష నాయకులు చేసినవి కావు. ఉపాధ్యాయ సంఘ నాయకులు చేసినవి అంతకంటేకావు. సాక్షాత్తూ ముఖ్యమంత్రి శ్రీ అంజయ్యగారు, విద్యామంత్రి శ్రీ వెంకట్రామ్ గారు చేసినవి.

"ఉపాధ్యాయులను నియమించకుండా క్రొత్త పాఠశాలలను ప్రారంభిస్తూ మనం ఎవరిని మోసంచేస్తున్నట్లు?" —విద్యామంత్రి గారి ప్రశ్న.

"కొంతమంది విద్యాశాఖాధికారులు వారిజిల్లాలలో కన్పించడం లేదు"— ముఖ్యమంత్రిగారి ఆరోపణ. "మన బాధ్యతలను నిర్వహించడంలో మనం విఫలమయ్యాం"—పార్లమెంటరీ సెక్రటరీ బి. రామకృష్ణ ఆత్మవిమర్శ.

'వారు వస్తారు. మాట్లాడుతారు. మరల వచ్చే సంవత్సరం కలవడానికి వెళతారు'— ఇది డిశంబరు 9, 10 తారీఖులలో హైద్రాబాద్‌లో జరిగిన విద్యాశాఖాధికారుల సదస్సు సారాంశం.

'విద్యార్థి తిరుగబడుతున్నాడు. ఉపాధ్యాయుడు కృంగిపోతున్నాడు. అధికారులు లంచగొండి పద్ధతుల నవలంబిస్తున్నారు. రాజకీయ నాయకులు చీకటిలో దేనికొరకోతడుము కొంటున్నారు. ఈస్థితికి కారణం ఏమిటి ?

—సదస్సులో పాల్గొన్న ప్రముఖులు రాష్ట్రంలో విద్యారంగం ఎదుర్కొంటున్న సమస్యలను గురించి చాలా ప్రశ్నలు లేవనెత్తారు. కాని వాటికి జవాబులు లేవు.

ఆనవాయితీగా సాంవత్సరికంగా జరిగే సదస్సులో సెక్రటేరియట్‌వారు విద్యాశాఖాధికారులను వారు పంపించవలసిన రిపోర్టులు, నింపవలసిన కాగితాలు సక్రమంగా నింపడంలేదని గుర్తు చేయడానికి ఉపకరిస్తుంది.

"గత సంవత్సరం అదనపు సెక్షన్లకు కావలసిన ఉపాధ్యాయుల సంఖ్యను తెలియజేయమని కోరడం జరిగింది. చాలామంది విద్యాశాఖాధికారులు యింతవరకు పంపించలేదు" — ఎజెండాలో ఒకపాయింటు.

"మిగిలిన జిల్లాలలో పాఠ్యపుస్తకాల విక్రయశాలలు తెరవాలని తీర్మానించడం జరిగింది. ఈ విషయంలో సాధించబడిన ప్రగతిని గురించి ఏ జిల్లా విద్యాశాఖాధికారి నుండీ సమాచారంలేదు" —ఎజెండాలో మరొక అంశం.

'పాఠశాలలు పశువుల పాకలుగనే వుంటున్నాయి. గవర్నమెంటు క్రొత్తవాటికి నిధులను కేటాయించడంలేదు. పరిశ్రమలమీద అదనంగా పన్నులు విధించి ఆ డబ్బును విద్యకు వినియోగించాలని, పాఠశాల భవన నిర్మాణసంస్థ అనే క్రొత్తసంస్థ ఈ బాధ్యతను నిర్వర్తిస్తుందని ఒక అస్పష్టమైన సూచనచేశారు ముఖ్యమంత్రిగారు.

410 గవర్నమెంటు పాఠశాలలో 400 పాఠశాలలు ప్రైవేటు వ్యక్తుల భవనాలలోనే ఉన్నాయన్నారు హైదరాబాదు విద్యాశాఖాధికారి. యజమానులు భవనాలను ఖాళీ చేయమంటున్నారనీ, కొద్దిగా కదిలిస్తే అవి పడిపోతాయనే భయంతో మరమ్మత్తులు చేయడంలేదనీకూడా వారు తెలిపారు.

1964లో అప్పటి ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు పాఠశాలల గ్రంథాలయాల భవనాలకు వార్షికంగా కొంత నిధులను కేటాయించాలని, అలాచేస్తే రెండు దశాబ్దాలలో సొంత భవనాల ఏర్పాటు పూర్తి అవుతుందని ఒకపథకాన్ని ప్రవేశపెట్టారు. మరుసటి సంవత్సరమే ఆ పథకానికి తిలోదకాలివ్వడం జరిగింది.

సదస్సుకు హాజరైన రాఘవాచారిగారు "ఉపాధ్యాయులను నియమించకుండా పాఠశాలలను ప్రారంభించమని వారెవరు కోరారు ? దానికి ఆటంకపడుతున్న దెవరు ? ప్రభుత్వాన్ని నడిపేది వారేగదా ! వారు చిత్తశుద్ధిగా చేయదలచుకుంటే అడ్డువచ్చే దెవరు?' అని ప్రశ్నించారు.

"పాఠశాలలలో పిల్లలను చేర్పించడం నానాటికీ ఎందుకు తగ్గుతుంది." అని విద్యాశాఖా మంత్రిగారు ప్రశ్నవేసి "బలహీన వర్గాలకు చెందినవారి పిల్లలను చేర్పించడం జరగడంలేదు. చేర్పించిన వారుకూడా బీదతనం, తల్లిదండ్రుల అనాసక్తతవలన పాఠశాల విద్య పూర్తి కాకముందే చదువు మానుకొంటున్నారు" అని వారే జవాబు చెప్పారు. (హిందూ సౌజన్యంతో)

---

## కుళ్ళుకు వేయికళ్ళు

గొరిపర్తి వెంకటేశ్వర్లు, ఏలూరు.

చూడు మానవతా వాదీ సమాజంలోని కుళ్ళు !
కడుగుదాం పొయ్యండి తలకో గ్లాసుడు నీళ్ళు !
కులం కట్టడిలో కుళ్ళు
మతం మౌఢ్యంలో కుళ్ళు
ఆచరాల ఆర్భాటంలో కుళ్ళు
పవిత్ర విద్యాలయాల్లో వ్యాపారపు కుళ్ళు
ఒక్క చోటేమిటి.... .... ... .... ....
కుళ్ళుకు సమాజంలో వేయికళ్ళు !
చూడు మానవతా వాదీ ! సమాజంలోని కుళ్ళు
కడుగుదాం పొయ్యండి తలకో గ్లాసుడు నీళ్ళు.

---

పెనుమంట్ర : 17-1-81న రేలంగి సెంటరు సమావేశంలో శ్రీ యస్. సత్తిరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన పెంటపు సెక్రటరీ ఎలక్షనులో యు.టి.యఫ్ సభ్యులు శ్రీ సురేష్ కుమార్ బి.యస్.సి బి.యి.డి.గారు 12 ఓట్ల ఆధిక్యతతో గెలుపొందేరు.




# అక్షరాస్యత, ఆర్థికాభివృద్ధి సాధనలో ఉపాధ్యాయ సంఘాల పాత్ర

—శ్రీ కె. యస్.

పాఠ్య విషయాలు, బోధనా విధానాలు ఆర్థిక సామాజిక పరిస్థితులపై ఆధారపడివుంటాయి. ఆర్థికసామాజిక పరిస్థితుల విశ్లేషణ సమాజంలో ఉపాధ్యాయ సంఘాలు నిర్వహించవలసిన పాత్రను నిర్దేశించుకొనడానికి దోహదపడుతుంది.

ఆసియాలోని దేశాలలో సామాజిక వ్యవస్థల స్వరూపాలలో ఆర్థికాభివృద్ధి స్థాయిలలో ఎంతో వైవిధ్యముంది. భూస్వామ్య జమీందారీ వ్యవస్థలు గలదేశాలున్నాయి. పెట్టుబడిదారీ వ్యవస్థగల దేశాలున్నాయి. అభివద్ధిచెందిన సోషలిస్టు వ్యవస్థలుగల దేశాలున్నాయి. ఆసియాభూభాగం ప్రపంచ భూభాగంలో మూడవవంతు. ప్రపంచ జనాభాలో 56శాతం ఆసియావారే.

## వలసపాలకుల నిర్వాకం

వలస పాలకులు వారి దేశాలు పారిశ్రామికంగా అభివృద్ధి చెందుటకు వీలుగా ఆసియా దేశాలను ముడిసరుకు నెగుమతిచేసే దేశాలుగా మార్చారు. ఆసియా ప్రజలు విద్య వెలుగులో దోపిడిని పసిగడతారనే భయంతో నిరక్షరాస్యత చీకటిని వ్యాపింపజేశారు. వారు ఆసియా దేశాలను వదలివెళ్ళిన తరువాత నిరక్షరాస్యతా నిర్మూలనకు ఆ దేశాలలో విపరీతంగా పెరుగుతున్న జనాభా, ఆర్థికంగా వెనుకబాటుతనం అవరోధాలుగా నిలిచాయి. 1950వరకు జడత్వంలో కూరుకుపోయిన విద్యావ్యాప్తి కార్యక్రమాలు వత్తిడకను ప్రారంభించాయి. 1960 సంవత్సరములో 5-24 సం॥ల మధ్య చదువుతునే వారి 25%. 1968 నాటికి అది 32 శాతానికి చేరుకున్నది. ఇది ఆసియా ఖండంలోని నిరక్షరాస్యత తీవ్రతను తెలియజేస్తుంది. విద్యావ్యాప్తి జనాభా పెరుగుదలకంటే కొంచెం ఎక్కువరేటులో జరుగుతున్నప్పటికీ 15 సం॥ల పైబడినవారిలో ఇప్పటికీ సగంమంది నిరక్షరాస్యులే. 1950 లో 76 శాతంగానున్న వయోజనులలో నిరక్షరాస్యులను 1960 నాటికి 66 శాతానికి 1970నాటికి 58 శాతానికి తగ్గించడం జరిగింది జనాభా పెరుగుదలను దృష్టిలో పెట్టుకుంటే 1950 నాటికి 307 మిలియనులుగానున్న నిరక్షరాస్యులు 1960 నాటికి 322 మిలియనులు 1970 నాటికి 355 మిలియనులు అయ్యారు. పాతకాల విద్య నిరక్షరాస్యతను తొలగించలేదనేది గత అనుభవాలు నేర్పిన గుణపాఠం.

## విద్య — జాతీయం పునర్నిర్మాణం

40 సం॥ల క్రితం ఎన్నో త్యాగాల ఫలితంగా ఫాసిజాన్ని అంత మొందించడం వలన కొన్ని దేశాలు రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించాయి. వలస పాలకుల దోపిడీకి వ్యతిరేకంగా పోరాడే యుద్ధరంగంగా మిగిలింది ఆసియా. ఈ మధ్యకాలం వరకు ఆసియా ఖండంలో ఏదో ఒక ప్రాంతంలో వలస పాలకులకు వయావలస పాలకులకు వ్యతిరేకంగా పోట్లాట జరగకుండా గడచిన వారంలేదు. ముప్పది సంవత్సరాలుగా వీరవియత్నాం ప్రజలు విరామమెరుగకుండా పోట్లాడి స్వాతంత్ర్యాన్ని సాధించి, శాంతి అభివృద్ధి పునాదులపై దేశ పునర్నిర్మాణం ప్రారంభించారు. పోరాడి సాధించిన స్వాతంత్ర్యంవలన మాత్రమే జాతి పురోగమింపగలదని వియత్నాం ప్రపంచ ప్రజలకు చాటి చెప్పింది.

రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించిన కొన్ని ఆసియాదేశాలు ఆర్థిక స్తబ్దతను అతిక్రమించి అభివృద్ధి పథంలో పురోగమిస్తున్నాయి. పెట్టుబడిదారీ విధానాన్ని తిరస్కరించిన దేశాల ప్రజల జీవనస్థాయి పెరిగింది. సాంఘికన్యాయం, ప్రజాస్వామ్య విలువలను పరిపుష్టం చేసికొని ఆర్థిక పురోగతి సాధించడంలో విద్యయొక్క ప్రముఖ పాత్రను ఈ దేశాలు గుర్తించాయి. ప్రజాశ్రేయస్సు కవసరమైన ఆర్థికసామాజికమార్పులను సాధించగలిగితే సాంస్కృతికంగా వెనుకబడినతనం, నిరక్షరాస్యతలను అధిగమించ వీలవుతుందని సోవియట్ రష్యా యితర సోషలిస్టు దేశాలు ప్రపంచ ప్రజలకు నిర్దిష్టమైన మార్గాలుచూపాయి. విద్యాప్రణాళికలను ఆర్థిక ప్రణాళికలతో సమన్వయ పరచగలిగినట్లైతే విద్యకొరకు పెట్టేఖర్చు ప్రయోజనకరమైన ఫలితాల నిస్తుందని, ఉత్పత్తిని పెంచి సామాజిక పురోగతికి దోహదం చేస్తుందని సోషలిస్టుదేశాలు ఆచరణాత్మకంగా నిరూపించాయి.

## దోపిడీ అభివృద్ధి నిరోధకం

అభివృద్ధి చెందుతున్న దేశాలలోని పేదరికానికి ప్రధాన కారణం ప్రపంచ పెట్టుబడిదారీ విధానంలోని దోపిడీ స్వభావం. పారిశ్రామిక అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలు ముడిసరుకుల నుత్పత్తిచేసే వెనుకబడిన దేశాల జాతీయ సంపదను కొల్లగొడుతున్నాయి. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలు బడుగు దేశాలనుండి ముడిసరుకులను చౌకగా దిగుమతి చేసికొని, వారి ఫ్యాక్టరీలలో తయారుచేసిన వస్తువులను వారు నిర్ణయించిన అధిక ధరలకు ఎగుమతులు చేయడంవలన బడుగుదేశాలు విపరీతమైన దోపిడికి గురిచేయబడుతున్నాయి. ఈ దేశాలు అసమాన ఒడంబడికల వలన సాలీనా 3 వేల మిలియనుల నష్టానికి గురవుతున్నాయి. అసమాన ఒడంబడికలు పేదదేశాలపై అజమాయిషీగల బహుళజాతి సంస్థల కార్యకలాపాల్లో భాగంగా ప్రవేశపెట్టబడినాయి. శాస్త్ర సాంకేతికాభివృద్ధిపై పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలకు గల అజమాయిషీ కూడ దోపిడీని తీవ్రతరం చేస్తుంది. శాస్త్ర సాంకేతికాభివృద్ధి వలన తక్కువ కార్మిక శ్రమశక్తితో ఎక్కువ ఉత్పత్తి సాధింపబడుతుంది. పారిశ్రామిక రంగంలో ఇండియా ఉత్పత్తి అమెరికా ఉత్పత్తిలో 50వ వంతు. వ్యవసాయరంగంలో 25వ వంతు. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో 4.5 నుండి 20శాతం వరకు ఆర్థికంగా ముందంజవేసిన ప్రజలు వారి దేశాలకు కావలసిన వాటికంటె ఎక్కువ పంటలను పండించ గలుగుతున్నారు. విముక్తి చెందిన దేశాలలో 60 నుండి 70 శాతంవరకు జనాభా మరికొన్ని దేశాలలో 90 శాతం జనాభా వ్యవసాయ రంగంలో కృషిచేస్తూ దేశాలకు కావలసిన ఆహార పదార్థాల నుత్పత్తి చేయలేకపోతున్నారు.

కాబట్టి ఈ పరిస్థితులు అభివృద్ధి చెందుతున్న దేశాలలో విజ్ఞాన సాంకేతిక శాస్త్రాభివృద్ధి ఆవశ్యకతను తెలియజేస్తున్నాయి.

ఆసియాదేశాలన్నీ వ్యావసాయిక దేశాలు గ్రామీణ ప్రాంతాల్లో నివసిస్తున్న కోట్లాది ప్రజానీకానికి బ్రతుకుతెరువు వ్యవసాయం అయినప్పటికీ వారంతా దారిద్ర్యరేఖకు దిగువలో వున్నారు. అన్ని రంగాలలో అభివృద్ధి సాధించాలనే యత్నం వ్యవసాయాభివృద్ధికి ఆటంకంగా పరిణమిస్తుందనే అభిప్రాయంతో అన్నిరంగాలనావలికి నెట్టి వ్యవసాయ రంగాన్ని ఆధునికీకరణ చేయడానికి చాలా దేశాలు ప్రయత్నిస్తున్నాయి.

## వ్యవసాయం రంగంలో ఆధునికీకరణ

వ్యవసాయరంగాన్ని ఆధునికీకరణ చేయడానికి ముందు చర్యగా జమిందారీ భూస్వామ్య సంబంధాలుగల గ్రామీణప్రాంతాల్లో భూమిపైగల హక్కును మార్చవలసివుంటుంది. ఆసియాదేశాలలో భూస్వామ్య సంబంధాలు బలంగా వుండటంవలన ఎంతగానో ప్రచారం చేయబడిన హరితవిప్లవాలు విఫలమయ్యాయి. వ్యవసాయ రంగంలో సాంకేతికాభివృద్ధివలన ధనవంతులైన వ్యవసాయదారులే ప్రయోజనాలు పొందారు. వ్యవసాయాని కనుకూల పరిస్థితులున్న ఆసియాలో తలసరి 225 కి.గ్రా. ధాన్యం మాత్రమే పండించగలుగుతున్నారు. ఉత్తరఅమెరికాలో 1100 కి. గ్రా. పండించగలుగుతున్నారు. దీనికి కారణం అచటి సామాజిక ఆర్థిక సాంకేతికాభివృద్ధి. వ్యవసాయాన్ని ఆధునీకరణ చేయడానికి ఆసియాలోని చాలా దేశాలలో భూసంస్కరణలను ప్రవేశ పెట్టారు. ఐనప్పటికీ ఈ సంస్కరణలను చిత్తశుద్ధితో అమలుజరపకపోవడం వలన చాలా దేశాలలో ఆశించిన ఫలితాలు సాధింపబడలేదు.

ప్రజలను చైతన్యవంతులుగాజేసి సామాజిక మార్పులను త్వరితగతిని సాధించి వారి జీవన ప్రమాణములను పెంచుతూ వియత్నాం- సమగ్రమైన భూసంస్కరణల నమలుజరిపి వ్యవసాయోత్పత్తుల నత్యధికంగా పెంచింది. ఇంతకుముందు దాదాపు 90 శాతం నిరక్షరాస్యులుగా నున్నదేశం విప్లవరీతిలో విద్యావ్యాప్తికి కృషిచేసి నిరక్షరాస్యతను నిర్మూలించింది.

## ఉపాధ్యాయ సంఘాల పాత్ర

దేశాలలోని సామాజిక పరిస్థితులు ఆర్థిక సంబంధాలు ఎలా వున్నప్పటికి సమాజం అధ్యాపకవృత్తికిచ్చిన బాధ్యతలను దృష్టిలో పెట్టుకుని తమ సభ్యులైన ఉపాధ్యాయుల హక్కుల రక్షణకొరకు వారి న్యాయ సమ్మతమైన కోరికల సాధనకొరకు ఉపాధ్యాయ సంఘాలు కృషి చేయవలసియుంటుంది. ప్రభుత్వం కొన్ని సందర్భాలలో సాదరంగా పరిశీలించి పరిష్కరించవచ్చు. మరికొన్ని సందర్భాలలో వాటిని నొక్కివేయడానికి దౌర్జన్యపద్ధతుల నుపయోగించవచ్చు. కాని ఉపాధ్యాయ సంఘాలు, అందలి సభ్యులు వారి వారి దేశాల బాలబాలికలు, ప్రజానీకం యెడల వారి బాధ్యతలను గుర్తెరిగి స్పష్టమైన ఆదర్శాల కొరకు కృషి చేయవలసియుంటుంది.

ఉపాధ్యాయుల ఆశయాలు పాలకవర్గంయొక్క ఆశయాలు ఏకీభవించినప్పుడు సామాజికార్థికాభివృద్ధికి విద్యాభివృద్ధికి సమన్వయం సాధింపబడుతుంది. అధ్యాపక సంఘాల ఆశయ సాధన కనుకూల వాతావరణ మేర్పడుతుంది. కార్మికవర్గం నాయకత్వంలో నున్న సోషలిస్టు సమాజంలో ఇది సాధ్యమవుతుంది. అచట కార్మిక వర్గానికి (ఉపాధ్యాయులు కార్మికవర్గం లోనివారే) పాలక వర్గానికి వైరుధ్యాలుండవు. ఆశయాల సారూప్యతవలన సమాజాభివృద్ధి విద్యాభివృద్ధి చెట్టాపట్టాలేసుకుని పురోగతిని సాధిస్తాయి. నూతన సమాజస్థాపన, విద్యాభివృద్ధి రంగాలలో ఉపాధ్యాయ సంఘాలు ప్రభుత్వ సహకారంతో సోషలిస్టుదేశాలలో ఎన్నోవిజయాలు సాధించాయి ఆసియా దేశాలలో పోరాటాల వలనకూడ సాధించిన విజయాలు స్వల్పమే.

అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలోని పరిస్థితి దీనికి పూర్తిగా భిన్నంగా వుంటుంది 'గుత్తపెట్టుబడిదారుల ప్రయోజనాల సాధనకొరకు దోపిడి తీవ్రంగావుంటుంది. గనుక జీవన ప్రమాణాలు అధికంగా వుండటం వలన ఉపాధ్యాయులు చాలా యిబ్బందులకు గురికావలసి వస్తుంది. ఉపాధ్యాయ సంఘాలు ప్రభుత్వం మధ్య వర్గ వైరుధ్యాలుంటాయి.

అభివృద్ధి చెందుతున్న దేశాలలోని పరిస్థితులు గందరగోళంగా వుంటాయి. వలస పాలకుల దోపిడీని పూర్తిగా అధిగమించలేక పోవడంవలన ఆర్థిక సామాజిక పరిస్థితులలో ఎంతో వైవిధ్యముంటుంది. పాలకవర్గం ప్రజల ఆశయాలు ఆలోచనలు కనుకూలంగా పనిచేస్తున్నప్పుడు ఉపాధ్యాయసంఘాలు సమస్యలను పరిష్కరించడానికెక్కువ అవకాశాలుంటాయి. పాలకవర్గం పెట్టుబడిదారీ విదేశీ శక్తుల కనుకూలంగా వున్నప్పుడు ఉపాధ్యాయ సంఘాలు విద్యాస్థాయి ఉపాధ్యాయుల స్థితిగతుల అభివృద్ధికొరకు పనిచేయడం కష్టసాధ్యమవుతుంది.

ఉపాధ్యాయ సంఘాలు వాటి ఆశయాలను ఆదర్శాలను రూపొందించుకుని ఆచరణ కొరకు కృషి చేసేటప్పుడు ప్రజా బాహుళ్యం నుండి వారితో కలిసి పనిచేసే శక్తుల నుండి ఎక్కువ సహాయ సహకారాలు పొందడం కొరకు వారి వారి దేశాలలో వున్న ఆర్థిక సామాజిక రాజకీయ పరిస్థితులను అంచనా వేసికొనవలసి వుంటుంది. అంటే ఉపాధ్యాయ సంఘాలు యితర ప్రజాసంఘాల సహకారాన్ని వీలైనంత ఎక్కువగా స్వీకరించవలసియుంటుంది.

## తల్లిదండ్రుల, కార్మికుల సహకారం

అభివృద్ధి చెందుతున్న దేశాలలో కార్మికవర్గం అల్పసంఖ్యాకంగానే వుండవచ్చు. అయినప్పటికి పటిష్టమైన నిర్మాణం కలిగి అభివృద్ధికాముక శక్తిగా వుంటుంది గనుక కార్మికవర్గం దేశాభివృద్ధిలో చాలా శక్తివంతమైన పాత్రను నిర్వహిస్తుంది. ఉపాధ్యాయులు ప్రజాస్వామ్య విద్య కొరకు బాలబాలికల ఉజ్వలభవిష్యత్తు కొరకు పోరాడేటప్పుడు కార్మికవర్గం వర్గచైతన్యంతో ప్రజాస్వామ్య విలువల పరిరక్షణకొరకు సహకరిస్తుంది. కాబట్టి ఉపాధ్యాయసంఘాలకు కార్మికవర్గం శక్తివంతమైన సన్నిహిత మిత్రునిలాంటిది.

ప్రజాబాహుళ్య మధికంగా నివసించే గ్రామీణ ప్రాంతాలలో ఉపాధ్యాయుడు, గౌరవనీయుడుగా వుంటాడు. వారికి విద్యయెడల గల గౌరవభావం వలనఆతడిసలహా సంప్రదింపులు కోరుతుంటారు. ఉపాధ్యాయుడు వారితో కలిసిమెలిసి జీవిస్తూ వారిఆర్థిక సాంస్కృతిక స్థాయిని పెంచడానికి కృషిచేయాలి. వ్యావసాయిక దేశాలైన ఆసియాదేశాల గ్రామీణ ప్రాంతాలలో అభ్యుదయ కార్యక్రమాలలో ఉపాధ్యాయుడు గ్రామస్థులతో కలిసిమెలిసి పనిచేయడాన్ని ఉపాధ్యాయ సంఘాలు ప్రోత్సహించాలి. శాస్త్రీయ విద్యావిధానం కొరకు బాలబాలికల భవిష్యత్తుకొరకు ఉపాధ్యాయ సంఘాలు పని

చేయడం వలన విద్యార్థులయొక్క, వారి తల్లిదండ్రుల యొక్క సహకారం లభిస్తుంది. ఉపాధ్యాయుడు విద్యార్థిమధ్య సాంప్రదాయకంగా వుండే దూరం తగ్గిపోయి సమిష్టిగా కృషి చేయవలసిన సమయం వచ్చింది.

## విద్య – ప్రజాస్వామ్యం

విద్యార్థుల తల్లిదండ్రుల సహకారం ప్రజాస్వామ్య వాతావరణంలో ఒకరి అభిప్రాయాలను మరొకరికి స్వేచ్ఛాయుతంగా వ్యక్తీకరించుకొనే పరిస్థితులలో సాధ్యమవుతుంది. ప్రజలు విజ్ఞానంతో చైతన్యవంతంగా పాల్గొనే ప్రజాస్వామ్య వ్యవస్థలో విద్యాభివృద్ధి జరుగుతుంది. విద్య ప్రజాస్వామ్య వ్యవస్థను పటిష్టంచేస్తుంది. విద్య ప్రజాస్వామ్యం పరస్పరం సహకరించుకుంటూ అభివృద్ధి చెందుతాయి. నిరక్షరాస్యత ప్రజాబాహుళ్యం రాజకీయాలలో చురుకుగా పాల్గొనడాని కవరోధంగా వుంటుంది గనుక నిరక్షరాస్యులెక్కువగా వున్న దేశంలో నిజమైన ప్రజాస్వామ్య వ్యవస్థ మనుగడకు అవకాశం లేదు. ప్రజాస్వామ్య విలువల నవగతం చేసికొని సాంఘిక పురోగతికి దోహదపడేవిధంగా విద్యావ్యాప్తి జరగాలి.

ఆసియాదేశాలలో ప్రజాస్వామ్య హక్కులు పదిలంగాలేవు. కొన్నిదేశాలలో సమ్మెచేసే హక్కుకూడాలేదు సమ్మెచేసే హక్కు యితర రాజకీయహక్కులు సాధింపబడినప్పుడు మాత్రమే విద్యావ్యాప్తి, ఉపాధ్యాయుల జీవనపరిస్థితులలో అభివృద్ధి సాధించడానికవకాశాలుంటాయి.

## బాలబాలికలందరికి విద్య

ఆసియా ఖండంలోని చాలాదేశాలలో యింకను వలసపాలనా కాలంనాటి విద్యా విధానాలే అమలులోవున్నాయి. అందరికి సమాన విద్యావకాశాలు కల్పించాలని ఆందోళనలు జరుపుతున్నప్పటికీ ధనిక వర్గానికొకవిధమైన పాఠశాలలు పేద వర్గానికొకరకమైన పాఠశాలలు గల ద్వంద్వపైఖరి కొనసాగుతున్నది. ఉపాధ్యాయసంఘాలు యితర అభివృద్ధికాముక శక్తులు ప్రజాస్వామ్య విద్యకొరకు పోరాడుతున్నాయి.

వలస పాలకుల వి దవారసత్వం ఈనాటి నిరక్షరాస్యత. ప్రజలు వారి బాధలను న్యూనతా భావాన్ని గమనించే విధంగా విద్య వారి కళ్ళు తెరిపిస్తుందని పాలకుల భయం. ప్రాపంచిక జ్ఞానం విజ్ఞాన సాంకేతిక శాస్త్రాలు విపరీతంగా అభివృద్ధి చెందిన ఈనాడు నిరక్షరాస్యత అరాచకత్వానికి దారితీస్తుంది.

నిరక్షరాస్యతను నిర్మూలించాలనే గట్టి పట్టుదల వుంటే సాధించడం అసాధ్యంకాదని సోవియట్ రష్యా, క్యూబా, వియత్నాం లాంటిదేశాలు నిరూపించాయి.

నిరక్షరాస్యతానిర్మూలనకు అన్నివనరులను సేకరించి ఉద్యమ స్థాయిలో పాఠశాలల్లో, పంటపొలాలలో, ఫ్యాక్టరీలలో యిళ్ళలో ఎల్లెడలా కృషిజరగాలి. కేవలం వ్రాయడం చదవడం నేర్చుకోవటమేగాక నిపుణతను పెంచుకుంటూ తన పరిజ్ఞానాన్ని పెంచుకోవలెననే దృక్పథం పౌరునికి కలిగేవిధంగా విద్యావ్యాప్తి కార్యక్రమాలను రూపొందించాలి. ప్రభుత్వం, స్వచ్ఛందసంస్థలు ప్రజాసంఘాల సహకారంతో ఉపాధ్యాయసంఘాలు నిరక్షరాస్యతా నిర్మూలనకు కృషిచేయాలి.

## ఉపాధ్యాయులు – సమాజం

అల్పసంఖ్యాక వర్గంగా వున్న పాలకవర్గంగాని లేక శ్రామిక వర్గంగాని ఎవరు అధికారంలోవుంటే వారి భావాలు బోధించే కేంద్రంగా వుంటుంది పాఠశాలం. పాఠశాల ఏనాడూ తటస్థంగా లేదు. కాని తటస్థంగా వుందనే స్వార్థపరుల మోసపూరిత ప్రచారానికి గురైన చాలమంది ఉపాధ్యాయులు, ప్రజలు వారి జీవనప్రమాణాల పెంపుదల కొరకు, ప్రజాస్వామ్య విలువలకొరకు సాంస్కృతికాభివృద్ధి కొరకు జరిపే పోరాటాలలో తటస్థులైనారి సవలంబించాలనే నిర్ణయానికి రావడం జరుగుతుంది. రాజకీయాలకతీతంగా ఏదీ లేదనేది చేదునిజం. పరస్పర విరుద్ధశక్తులమధ్య సంఘర్షణ జరుగుతున్న సమాజంలో ఉపాధ్యాయులు ఒక వర్గంలోని వారైనప్పుడు ఉపాధ్యాయ సంఘాలు రాజకీయాలకతీతంగా ఎలా వుంటాయి? ఉపాధ్యాయుల కిష్టం వున్నా లేకపోయినా వారిపోరాటాలు రాజకీయ స్వభావం కలిగివుంటాయి. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కొరకు శాంతి సామాజిక ప్రగతికొరకు జరిగే పోరాటాలను ఉపాధ్యాయసంఘాలు సమాజశ్రేయస్సు దృష్టితోనేగాక వారి శ్రేయస్సు నాశిస్తూగూడ సమర్థించవలసి యుంటుంది.

అభివృద్ధిచెందిన ప్రసార సాధనాలవలన, ఒకరిపైనొకరు ఆధారపడి జీవించవలసిన పరిస్థితులవలన, ఈనాటి మానవుడు సమాజాని కతీతంగా ప్రపంచ పైఖరికి భిన్నంగా లేనందువలన ప్రపంచంలో యితర ప్రాంతాలలోని సంఘటనల ప్రభావం అతనిపై ప్రసరించి తీరుతుంది. ప్రపంచంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకొరకు సామాజిక న్యాయంకొరకు పోరాటాలు జరుగుతున్న ప్రాంతాలలో గణనీయమైన అభివృద్ధి సాధించబడింది. ఉపాధ్యాయులు వీటిని గమనిస్తూనే వున్నారు. గమనించడమే కాదు. ఉదయిస్తున్న అరుణారుణ కాంతులకు స్వాగతాలు చెపుతారు.

ప్రపంచ ప్రజలు శాంతిని కోరుతున్నారు. శాంతి కాముకత యుద్ధాల వలన సంభవించే అపారమైన నష్టాలను నివారించడమే గాక యుద్ధ పరికరాలకొరకు వినియోగింపబడే వనరులను ఆర్థిక, సాంస్కృతిక రంగాల అభివృద్ధికి వినియోగింపబడుటకు దోహదం చేయడం వలన ప్రపంచవ్యాప్తంగా పేదరికం, ఆకలి, నిరక్షరాస్యతలను నిర్మూలించడానికి సహాయపడుతుంది. యుద్ధ పరికరాలకు ఉపయోగించే పెద్ద మొత్తాలను శాంతి సౌమనస్యాల కుపయోగించడం వలన ప్రపంచ వ్యాప్తంగా ప్రజలు సుఖసంతోషాలతో తులతూగుతారు. ప్రస్తుతం చాలా దేశాలలో జరుగుతున్నట్లు ఉపాధ్యాయులకు ఉద్యోగభద్రత లేకపోవడం విద్యార్థులలో కోతలు యికపై వుండవు. ఇది కలగా మిగిలిపోదు. నేడో రేపో నిజం కాబోతుంది. ఉపాధ్యాయులు బాలబాలికల శ్రేయస్సు తద్వారా భవిష్యత్ మానవ సమాజ శ్రేయస్సు వాంఛిస్తారు గనుక వారి సంఘాలు మానవాళికి మంచిరోజులు తెచ్చిపెట్టే శాంతి సామాజికాభివృద్ధి కొరకు కృషిచేయాలి.

## ఉపాధ్యాయసంఘాల పరస్పర సహకారం

ప్రపంచవ్యాప్తంగా విద్యారంగానికి, అధ్యాపకవృత్తికి ఎదురవుతున్న క్లిష్ట సమస్యలను అంతర్జాతీయంగా చర్చించి ఐక్య కార్యాచరణద్వారా పరిష్కరించుకోవలసిన ఆవశ్యకతను ఉపాధ్యాయులు గుర్తిస్తున్నారు.

విద్యారంగంలోని సంక్షోభం ఒక దేశానికి పరిమితమైలేదు.




ఖమ్మంజిల్లాకు : ఐ. వినోద్. హైయర్ గ్రేడ్, వీరులూరు, శంఖవరం సమితి, తూ.గో. జిల్లా.

ఖమ్మం, నల్గొండ : (జడ్. పి. హైస్కూళ్ళకు) యస్. వెంకటేశ్వర్లు, సెకండరీ గ్రేడ్, యస్. యు. పి. స్కూలు, గొట్టుముక్కల, (వయా) కంచికచర్ల కృష్ణాజిల్లా 521180.

గుంటూరుజిల్లాకు : (వల్లపాడు సమితి) డి. దుర్గా ప్రసాద్, యు. పి. స్కూలు, చాట్రాయి 521214 విస్సన్నపేట సమితి, గ్రేడ్ II తెలుగు పండిట్, కృష్ణాజిల్లా

కృష్ణాజిల్లాకు : టి. యల్. నరసింహమూర్తి, సెకండరీ గ్రేడ్, పి యస్. ఎలిమెంటరీ స్కూలు, శివపురం, పెరవలి సమితి, తణుకు తాలూకా, ప. గో. జిల్లా.

---

కాకినాడ పట్టణశాఖ : 2-9-80న పట్టణ యు.టి.ఎఫ్ శాఖ ఇచ్చిన మెమోరాండం పురస్కరించుకొని, పట్టణశాఖ అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు శ్రీ ఇ.వి.ఆర్. రామమోహనరావు, శ్రీ జి. చిట్టెయ్యలతో సమావేశం ఏర్పాటు చేయబడి యీ క్రింది సమస్యలు పరిష్కరింపబడినవి. 64, 69, 77 సం. లలో ఓటర్ల జాబితాలు వ్రాసిన కాలమునకు ఎరండ్ లీవు రిజర్వుచేయుట, 73 సమ్మె సందర్భంలో వేసవి శలవల్లో పనిచేసిన కాలానికి లీవు క్రెడిట్ చేయుట, హైయర్ గ్రేడులో పనిచేస్తున్న బి ఇ.డి లను అప్‌గ్రేడ్ చేసి అరియర్లు ఇచ్చుట, 76, 77, 78 సెలక్షన్ గ్రేడ్ పోస్టులు అర్హతగల వారికి ఇచ్చుట సీనియారిటీ లిస్టులు, జూనియర్ ఇంక్రిమెంటు, తేదీకి సీనియర్ ఇంక్రిమెంట్ మార్చుట, అదనపు విద్యార్హతలకు అదనపు ఇంక్రిమెంట్లు మొదలగు 12 సమస్యలు చర్చించి పరిష్కరింపబడినవి. సమస్యా పరిష్కారానికి తోడ్పడిన అధికారులకు పట్టణశాఖ ధన్యవాదాలు తెల్పుతున్నది.

---

పెట్టుబడిదారీ దేశాలన్నిటా వుంది. విద్యకు పెట్టే ఖర్చు ఉత్పత్తి సాధించలేని పెట్టుబడిగా భావించడమే దీనికి కారణం. అభివృద్ధి చెందుతున్న దేశాలలో విద్యా సమస్యలు మరీ జటిలంగా తయారవుతున్నాయి. వివిధ దేశాలలోని ఉపాధ్యాయుల సామాజిక ఆర్థిక పరిస్థితులు క్లిష్టంగాతయారయ్యాయి. ఇలాంటి సమస్యల పరిష్కారం కొరకు సామూహిక చర్యలు జరపాలి. సక్రమంగా పనిచేయడానికి కావలసిన వసతుల కొరకు, జీవన పరిస్థితులు అభివృద్ధి పరచుకొనుట కొరకు ప్రజాస్వామ్య విద్యావిధానం కొరకు ఉపాధ్యాయులెక్కించిన పోరాటాలు సాగిస్తున్నా ప్రపంచ వ్యాప్తంగా వున్న ఉపాధ్యాయ సంఘాలు వారికి తమ మద్దతును ప్రకటిస్తూ సహాయ సహకారాలందజేయాలి.

(టీచర్స్ ఆఫ్ ది వరల్డు సౌజన్యంతో)

# మనము - మన ఆరోగ్యం

# ధూమపాన భూతం

ప్రపంచ ఆరోగ్య దిన సందర్భంగా ధూమపానంవల్ల కలిగే అనర్థకాలు గత సంవత్సరం చర్చింపబడ్డాయి. ధూమపానమా ? ఆరోగ్యమా ? — మీరే నిర్ణయించుకోండి ! — అనే అంశం దేశదేశాల్లో చర్చనీయాంశమయింది. ఈ సారాంశంగా ధూమపానం వల్ల సంక్రమించే కొన్ని దీర్ఘ అరిష్టాలను మనం తెలుసుకొందాం,

1. ఊపిరితిత్తులకుగాని, శరీరంలోని ఇతర అవయవాలను గాని క్యాన్సర్ వ్యాధి సంక్రమించటం ధూమ పానంవల్ల గలిగే ముఖ్య నష్టం. బొంబాయిలో నమోదయిన క్యాన్సర్ కేసులలెక్క ప్రకారం పురుషులలో ప్రతిలక్షకు 6.2 చొప్పున, స్త్రీలలో ప్రతిలక్షకు 1.5 చొప్పున ఊపిరితిత్తులు, శ్వాసనాళానికి సంబంధించిన క్యాన్సర్ వ్యాధి సంభవించినట్లు కనుగొన్నారు. ధూమపానానికి యీ వ్యాధికి సన్నిహిత సంబంధమున్నట్లు పరిశోధనలో తేలింది. పొగత్రాగని వారికంటె త్రాగేవారిలో క్యాన్సర్ వ్యాధి వచ్చే ప్రమాదంరేటు 2.60 ఉన్నట్లు తేలింది. బీడీలు కాల్చేవారిలో ఈ రేటు 2.52 ఉండగా, సిగరెట్లు కాల్చేవారిలో ఇది 3.91 ఉన్నది. భారతదేశంలో సిగరెట్లకంటే బీడీలు అన్నవాహిక క్యాన్సర్ వ్యాధికి అధికంగా కారణలవుతాయని తేలింది.

2. పొగత్రాగేవారు 40, 50 సంవత్సరాలకే అకాల మృత్యువుకు హెచ్చుసంఖ్యలో లోనవుతున్నారు.

3. మితిమీరి ధూమపానం చేసేవారు మూడు రెట్లు దీర్ఘ వ్యాధులకు లోనయ్యే అవకాశాలు ఎక్కువగా వున్నాయి.

4. బాల్యంలోనే ధూమపానానికి అలవాటుపడ్డ వారిలో మరణాలరేటు అధికంగా ఉంది. ఇట్టివారు విపరీతమైన ధూమపానానికి, పొగను గాఢంగా లోపలికి పీల్చే దుర్వ్యసనానికి లోనయిపోతారు.

5 ధూమపాన ప్రభావంవల్ల మామూలు కంటె 20 సార్లవరకూ ఎక్కువగా నాడి కొట్టుకొంటుంది. రక్తపోటు కూడా అధికంగా పెరుగుతుంది.

6. గర్భిణీస్త్రీలు ధూమపానం చేయడంవల్ల వారికిపుట్టబోయే శిశువులకు ప్రమాదం వాటిల్లుతుంది. వీరు రోజుకు పది సిగరెట్లు చొప్పున కాల్చడంవల్ల వారికిపుట్టబోయే శిశువు పుట్టుకకు ముందుగాని, పుట్టిన మొదటి నాలుగు వారాలలోగానీ మరణించే అవకాశం ఎక్కువగా ఉంది. ఇంకా వీరికి పుట్టే పిల్లల బరువు తక్కువగా ఉండటం, గర్భిణీ కాలంలో తరుగుదల, అధికంగా గర్భస్రావాలు సంభవించటం, గర్భస్థ శిశువుల మరణాలలో హెచ్చురేటు ఉన్నట్లు కనుగొన్నారు.

7. పొగాకు నమిలే అలవాటున్న వారికి నోటి క్యాన్సరు వచ్చే అవకాశాలు విరివిరిగా ఉన్నాయి.




## వృత్తివిద్యలు - పాఠశాలలు

శ్రీ కె. కోటేశ్వరాచారి
వెల్గొండ, మ.నగర్ జిల్లా

విద్యావిధానంలో వృత్తి విద్యల్ని ప్రవేశపెట్టాలనీ, పని అనుభవాల్ని (వర్క్ ఎక్స్‌పీరియన్స్) జోడించాలనీ, ప్రత్యక్ష జ్ఞానానికి (ప్రాక్టికల్ నాలెడ్జ్) ప్రాధాన్యతనివ్వాలని, శ్రమ గౌరవాన్ని పెంపొందించాలనీ, శ్రమఫలితాన్ని బిడ్డలు పొందేట్టు చూడాలని, ఈ చర్యల ద్వారా విద్య జీవితానికి ఉపయోగించేట్టు చేయాలని మన ఉద్యమం ప్రబోధిస్తున్నది. ఆందోళన చేస్తున్నది.

దానికి పూర్వరంగంగా ప్రస్తుతం పాఠశాలల్లో వృత్తివిద్యలు ఏ పరిస్థితిలో వున్నవి, వాటినెలా సంస్కరించాల్సింది, ఆధునికం చేయాల్సింది తెలుసుకోవటం అవసరం.

మన పాఠశాలల్లో ప్రస్తుతం ఆర్ట్స్, క్రాఫ్ట్స్ పేరతో చిత్రకళ, సంగీతం, కట్లుపని, కుట్టుపని, నేతపని, వ్యవసాయం మొదలైన పని నామమాత్రంగా ఉన్నాయి. వాటికి ఉపాధ్యాయ నియామకం కూడా జరుగుతున్నది. చాల పాఠశాలల్లో వాటికి తగిన బోధనా పరికరాలుండవు, వర్క్‌షాప్ ఉండదు, ముడిసరుకు వస్తాయి అంతకంటేవుండదు. సిలబస్‌గాని, బడ్జెట్ ఎలాట్‌మెంట్‌గాని అసలు వుండదు. ఇలా ఏ ప్రోత్సాహమూలేక ఆచరణలో అవి నిర్వీర్యం చేయబడుతున్నాయి. చాలచోట్ల వృత్తి విద్యలకు కేటాయించిన పీరియడ్లు పబ్లిక్ పరీక్షలకు ఉపయోగించు పాఠ్యాంశ బోధనకు (ఉదా: ఇంగ్లీషు, లెక్కలు) ఉపయోగించబడుతున్నవి. ఈవిధంగా వృత్తి విద్యలు మన పాఠశాలల్లో విపరీత నిర్లక్ష్యానికి గురిచేయబడుతూ నిరుపయోగకరంగా వున్నాయి. వృత్తివిద్యా బోధకులు గోళ్ళు గిల్లుకుంటూ కూర్చునే దుస్థితి కావాలని కల్పించబడుతున్నది. ఈ స్థితిని వెంటనే మార్చేచర్యలు తీసుకోవాలి. విద్యార్థులకు ఉపయోగకరంగా ఉండేట్టు వాటిని తీర్చిదిద్దాలి.

మనదేశం వ్యవసాయిక దేశం. గ్రామీణ ప్రాంతాల్లో ఎనభైశాతం మంది వ్యవసాయంమీద ఆధారపడి ఉన్నారు. దానికి అనుబంధంగా అనేక చేతిపనులు వృత్తులుగా సాగుతున్నాయి. స్వయంపోషకంగా ఉండే ఆవృత్తులన్నీ పరాయి పాలనలో ధ్వంసం చేయబడ్డాయి. యాంత్రికపోటీ వచ్చి మూలబడ్డాయి. మార్కెట్‌లేక నిరాధారస్థితి కల్పింపబడింది. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతకూడా ఆ దుస్థితి పెరిగిందేతప్ప ఏ అదుపూ కాలేదు.

కాన ఉన్నస్థితిని ఉపయోగించుకొని వాటికి తగు ప్రోత్సాహమిచ్చి, క్రమంగా ఆధునికం చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. వృత్తులన్నీ యాంత్రికం చేయబడేదాకా చేతివృత్తుల్నికూడా ప్రోత్సహించాల్సిన ప్రత్యేక పరిస్థితి మనదేశంలో ఉంది. అందువల్ల ప్రణాళికాబద్ధంగా పాఠశాలల్లో వృత్తివిద్యల్ని ప్రోత్సహించాల్సిన అవసరం ఏర్పడింది.

మరి వాటిని ఆచరణలోకి తెచ్చేదెలా? ఉదాహరణకు వ్యవసాయాన్నీ తీసుకొందాం. ప్రాథమిక పాఠశాలల్లో పిల్లల వయసుకు తగినట్లు మడులుకట్టుట, కాలువలు తీయుట, కూరగాయలు పండించుట, పూలమొక్కలు పెంచుట పనులు నేర్పవచ్చు. క్రమక్రమంగా ఆధునిక వ్యవసాయ పద్ధతులు నేర్పటం, యంత్రాల ఉపయోగించటం అమలులోకి తేవచ్చు. విద్యార్థులు శ్రమపడి పండించిన ఫలితాన్ని వారికే ఉపయోగిస్తే ఆర్థికమైన వెసులుబాటు అటు ప్రభుత్వానికి ఇటు తల్లిదండ్రులకూ లభిస్తుంది. అన్నిటికంటె మించి శ్రమ గౌరవం అలవాటవుతుంది. కొన్నిపాఠశాలల్లో వ్యవసాయ బోధకులు కూరగాయలు పండించటం ద్వారా వేలాది ధనాన్ని ఫలితంగా చూపిన ఘటనలు కూడా ఉన్నాయి.

అలాగే వడ్రంగం బుక్ షెల్ఫులు, హేంగర్లు, బెంచీలు మొదలగు ఉపయోగకర వస్తువులు కట్లపనిలో తయారు చేయించవచ్చు. చిత్రలేఖనను ఆధునికంచేసి బోర్డులు వ్రాయటం, పెయింట్ చేయటం ద్వారా బ్రతుకు తెరువు కల్పించవచ్చు. క్రమ క్రమంగా చిన్న చిన్న యంత్రాలను ప్రవేశపెట్టి, వర్క్‌షాపులు అమలులోకి తేవచ్చును. దానికి ప్రస్తుతంపనిచేసే ఉపాధ్యాయుల్ని షార్ట్‌కోర్సులు ప్రవేశపెట్టి శిక్షణలిచ్చి తయారుచేసి ఉపయోగించుకొనవచ్చును. ఈ విధంగా ఎక్కువ ఖర్చులేకుండా క్రమబద్ధమైన అభివృద్ధి సాధించటం నేటి తక్షణ కర్తవ్యం.



447 శ్రీ డి. సత్యనారాయణ
లక్ష్మీపురం, ఖమ్మం



1446 శ్రీ యం. డి. ఖుద్దూస్
తూముకుంట, యం.నగర్



1584 శ్రీ ఆర్. సుబ్బారావు
కొండుకోడూరు, తూ. గో.



2054 శ్రీ బి. లక్ష్మీకాంతశర్మ
అల్వాల, హైదరాబాదు



1729 శ్రీ వి. సాంబశివుడు
పీపనగండ్ల, యం.నగర్



1761 శ్రీ సిహెచ్. వి. సుబ్బయ్య
ఒంగోలు, ప్రకాశం



1800 శ్రీ షేక్ మస్తాన్‌వలి
అలకూరపాడు, ప్రకాశం



1809 శ్రీ బి. స్వామిరెడ్డి
తూముకుంట, యం.నగర్



1837 శ్రీ టి. కోటేశ్వరరావు
ఒంగోలు, ప్రకాశం



1873 శ్రీ జి. పుల్లయ్య దంపతులు
తూముకుంట, యం.నగర్



1877 శ్రీ సుగుణబ్రహ్మం
శ్రీరంగాపురం, యం.నగర్



1893 శ్రీ కె. సాంబశివరెడ్డి
ఓబనపల్లి, చిత్తూరు



1922 శ్రీ డి. శ్రీరామమూర్తి
గేదెల్లంక, తూ. గో.



1990 చి॥ వీరభద్రారెడ్డికి శుభాకాంక్షలతో, శ్రీ జి. లక్ష్మీకాంతం
రామచంద్రపురం, తూ. గో.



1991 శ్రీ వి. జగదీశ్వరరావు
రామచంద్రపురం, తూ. గో.



1998 శ్రీ యన్. విశ్వనాథం
ఆచంట, ప. గో.






2003 శ్రీ టి. వెంకటేశ్వరరెడ్డి
కొల్లివారిగూడెం, ప. గో.

2004 శ్రీ టి. పెద్దిరాజు
శ్రీరామవరం (తెడ్లం) ప.గో.

2013 శ్రీ కె. సూర్యనారాయణ
పాలచర్ల, తూ. గో.

2021 శ్రీ కె. సత్యనారాయణ
కె. కె. పాలెం, తూ. గో






2002 శ్రీమతి మేరీ శామ్యూయేల్
హైద్రాబాద్

2034 శ్రీ యన్. కృష్ణయ్య
తిమ్మాపురం, ప.గో.

2038 చిరంజీవులకు శుభాకాంక్షలతో
శ్రీ యం.చంద్రమౌళి, కల్వకుర్తి,యం.నగర్.

శ్రీ బి. అంజనేయులు
అబ్బూరు, గుంటూరు

---




2002 శ్రీ కె. చంద్రశేఖరరెడ్డి, పగడవరం, తూ. గో.
2005 ,, బి. వెంకటేశ్వర్లు, కాపుగల్, నల్గొండ
2006 ,, యస్. హుస్సేన్, సిరిపురం, ,,
2007 ,, కె. సత్యనారాయణ. పాలపాడు, గుంటూరు
2008 శ్రీమతి శారదమ్మ, వెల్గొండ, యం.నగర్
2009 శ్రీ యన్. వి. శేషాచార్యులు, అంకూరపాడు, ప్రకాశం.
2010 శ్రీమతి మేరీ ప్రమీల, హైదరాబాద్
2011 ,, యస్. వి. సులోచన, సికిందరాబాద్.
2012 శ్రీ యం. భాస్కరరావు, హైదరాబాద్
2014 ,, కె. కృష్ణయ్య, మధిర, ఖమ్మం
2015 ,, కె. కరంచంద్ మోహన్‌దాస్‌గాంధి, మోపిదేవి, కృష్ణా
2016 ,, యస్. కె. వజీర్ బాషా, కంభవరం, ప్రకాశం
2017 ,, పి.వి సుబ్బారావు భీమవరం, ప్రకాశం
2018 ,, శ్రీమతి ఇందిరాదేవి, మానేపల్లి, తూ గో
2019 ,, శ్రీ యన్.కె.వి. చలపతిరావు, నాగసముద్రం,
2020 ,, కె. జాన్ ప్రసాదరావు, అయినాపురం, తూ. గో
2022 శ్రీమతి యం. రాజరాజేశ్వరి, సికిందరాబాద్
2023 ,, శ్రీ యం.వి శాస్త్రి, ప్రత్తిపాడు, తూ. గో
2024 ,, సి.హెచ్.వి వి. సూర్యనారాయణ, ఊమ్మంగి, తూ.గో
2025 ,, ఋ. జగ్గయ్య, ,, ,,
2026 ,, యస్. రాఘవరావు ఏలేశ్వరం ,,
2027 ,, యస్. దొరయ్య, ,, ,,
2028 ,, వి. విజయరత్నం, ,, ,,
2029 ,, యన్. రత్నమ్మ, ,, ,,
2030 ,, చంటబ్బాయి, ఉత్తరకంచి, ,,
2031 ,, షేక్ మస్తాన్ పరుచూరు, ప్రకాశం.
2032 శ్రీమతి మేరీ శామ్యూల్ హైదరాబాద్
2033 శ్రీ యం. హరిప్రసాదరావు, ప్యావద్రు, గుంటూరు
2035 ,, జి. మురహరిరావు, బూకుపల్లి, ,,
2036 ,, ఆర్. రామారావు, కొణిజర్ల, ఖమ్మం
2037 ,, యన్. అంజనేయులు, కోటిపల్లి, తూ. గో.
2039 ,, యం. భూపాలరావు, గట్టుఇప్పలపల్లి, యం. నగర్
2040 ,, యన్. గంగయ్య, వెంగలత్తూర్. చిత్తూరు
2041 ,, ఇ. వి. ఆర్. రామమోహన్‌రావు, కాకినాడ, తూ. గో.
2042 ,, వి. నాగేశ్వరరావు, అమలాపురం ,,
2043 ,, డి. వెంకటేశ్వరరెడ్డి, మల్లవరం, ప్రకాశం
2044 ,, ఎ. మహబూబ్‌సాహెబ్, బుచ్చిరాజుపల్లి, అనంతపూర్
2045 ,, వై. అశ్వర్ధనారాయణరెడ్డి, పెనుగొండ ,,



## అనంతపురం జడ్. పి. ఆఫీసులో విలువు దోపిడీ

'కదిలితే లంచం.... మెదిలితే లంచం !'

—ఇదీ ఒక్కమాటలో చెప్పాలంటే అనంతపురం జడ్. పి ఆఫీసులో దుస్థితి.

డబ్బులిచ్చిన వారి సమస్యలు ఇట్టే అయిపోతాయి.

ఇవ్వని వారివి ఏండ్లూ పూండ్లూ గడిచినా అతీగతీ ఉండదు.

సుదూర ప్రాంతాల నుండి ఛార్జీలు భరించి, శ్రమకోర్చి ఆఫీసుకు వెళ్తే 'అదిగో.... ఇదిగో' నంటూ ఏదో కుంటిసాకు చెప్పి చివరికి తొంటిచెయ్యి చూపటం.... ఆ టీచరు ఉస్సూరమ కొంటూ.... నిరాశా నిట్టూర్పులతో గూటికి చేరుకోవటం ?

దానికితోడు దళారీల బెడద ! ఫిఫ్టీ... ఫిఫ్టీ సూత్రం !

కులభేదాలు రెచ్చగొట్టి.... పబ్బం గడుపుకోవటం !

ఉపాధ్యాయుల కష్టార్జితంతో జల్సాలూ.... డిన్నర్లూ !

బదిలీకి స్టీల్ వాటర్ డ్రమ్, లేదా రు. 150 ముడుపు !

సమితినుండి జడ్.పి. కి రావాలంటే రు. 500 రేటు !

ఒకే లిస్టులో ప్రమోట్ అయిన వారికి లంచం ఇస్తే ఎరియర్లు మంజూరు ఇవ్వకపోతే ఆప్షన్ ఫారాలతో సహా అన్నీ మటుమాయం! గోల్ మాల్ !

ఈ దోపిడీ ఎన్నాళ్ళని సాగేటట్టు ?

ప్రభుత్వం పీకితోపాధ్యాయుల మొరలాలకించి బహిరంగ విచారణ జరుపి ఇప్పటికైనా అవినీతి నరికడుతుందా ?

పిల్లి కూడా గదిలో బంధిస్తే ఎదురు తిరుగుతుంది.

ఓర్పుకుకూడా హద్దు ఉన్నదనీ, ఉద్యమ జంఝూమారుతం చెలరేగకముందే అక్రమాన్ని ఆపవలసిందిగా జడ్.పి. అధికారుల్ని హెచ్చరిస్తున్నాం !

2046 శ్రీ పి. లక్ష్మణరావు, పిన్నదరి, అనంతపూర్ జిల్లా.
2047 ,, యస్. అబ్దుల్ గఫూర్, పేరూర్ ,,
2048 ,, హెచ్. అబ్దుల్ గనీ సాహెబ్, బసంపల్లి, ,,
2049 ,, టి.డి.వి. బాలదాస్, తూరుబాక ఖమ్మం
2050 ,, బి. ఆంజనేయులు, అబ్బరాజుపాలెం గుంటూరు
2051 ,, జె. బుచ్చయ్యశర్మ, అనంతవరం. ,,
2 52 ,, ఎ. మోహనరావు, కొల్లిపర ,,
2053 ,, జె. రంగారావు, జీలుగుమెల్లి, ప. గో.
2055 ,, ఎ. చంద్రమౌళి, చారకొండ, మ.నగర్
2056 శ్రీమతి జె. నాగరత్నం, గంటాపురం, అనంతపూర్ జిల్లా
2057 శ్రీ గొట్టుముక్కల రామలింగరాజు, పాలకోడేరు, ప.గో.జిల్లా
2058 ,, డి. అనంతరామశర్మ, హుజూర్ నగర్, నల్గొండజిల్లా
2059 ,, బి. చంద్రరావు, పెదమల్లాం, ప.గో: జిల్లా
2060 ,, మంతెన నరసింహరాజు, కొమ్మర, ,,
2061 ,, చేతు రామదాసు, అత్తిలి ,,
2062 ,, పి. సమాధానం, ,, ,,
2063 ,, ఎ. సత్యనారాయణ, ఉండాళ్ళపాలెం, ,,
2064 శ్రీమతి జి.పి.బి. కృపావరం, అత్తిలి ,,
2065 శ్రీ బి. హెచ్.యస్ బి. విశ్వనాథశర్మ, రేలంగి, ప.గో. జిల్లా

***

## తెనాలి టీచర్ల ఆందోళన విరమణ

తెనాలి శ్రద్ధానంత హరిజన కాలనీ హైస్కూలు టీచర్ల సమస్యా పరిష్కారానికి సాగిస్తున్న ఆందోళన తారస్థాయికి చేరి 20వ తేదీ తీవ్ర ప్రత్యక్ష చర్యా కార్యక్రమం తీసుకోవటంతో పరిష్కారం సాధింపబడింది. శ్రీ యం. జె. మాణిక్యారావు ఆధ్వర్యాన 50 మంది కార్యకర్తలు సదరు హైస్కూలు ముందు నినాదాలు చేస్తూ ప్రదర్శన జరపగా ఆర్.డి.ఓ., డి.ఇ.ఓ.గార్లు ఆ టీచర్లను ఉద్యోగాలలో చేర్చటానికి బాధ్యత తీసుకొంటామని హామీయిచ్చారు. దానిపై తాత్కాలికంగా ఆందోళన విరమింపబడింది.

## ప్రకాశంజిల్లా, వెంకటరెడ్డిపల్లి, వి.సి.ఎ. హైస్కూలు (వెలిగండ్ల సమితి) రు. 500 చొ॥న జనరల్ ఫండ్ ఇచ్చిన టీచర్లు



శ్రీ యస్. సి. చౌడారెడ్డి, యం.ఎ.బి.యిడి | శ్రీ యం. కొండారెడ్డి, బి.యస్.సి.బి.యిడి. | శ్రీ టి. వెంకటసుబ్బయ్య, తెలుగు పండిట్ | శ్రీ డి. వెంకటసుబ్బయ్య, బి.యస్.సి.బి.యిడి.



## టెంపరరీ టీచర్లను కంటిన్యూ చేయాలి

### యు.టి.యఫ్ సబ్ కమిటీ సమావేశ విజ్ఞప్తి

రాష్ట్రంలో వివిధ మేనేజిమెంట్ల క్రింద పనిచేస్తున్న అన్ ట్రైండ్ టీచర్లను తీసివేస్తామని నోటీసు లివ్వబడుతున్నాయని, వారికి శిక్షణ సౌకర్యం కల్పించాల్సిన బాధ్యత ప్రభుత్వానిదేననీ, అందువల్ల వారందరికీ శిక్షణా సౌకర్యం కల్పించేంతవరకు ఉద్యోగాల్లో కొనసాగించవలసిందిగాను, అలాగే ఇప్పటివరకు ఉద్యోగాల్లో కొనసాగుతున్న అన్ క్వాలిఫైడ్ టీచర్లందరినీ శాశ్వత మినహాయింపు ఇచ్చి కొనసాగించ వలసిందిగా కోరుతూ జనవరి 10న విజయవాడ చెన్నుపాటి భవన్‌లో శ్రీ డి. రామిరెడ్డి, అధ్యక్షతన సమావేశమైన యు. టి. యఫ్ సబ్‌కమిటీ రాష్ట్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది.

అంతేగాక కేంద్ర ప్రభుత్వం ఇటీవల ప్రకటించిన డి.ఎ.ను వెంటనే అమలు పరచవలసిందిగాను, నిత్యజీవితావసర వస్తువుల్ని చౌక డిపోల ద్వారా సరసమైన ధరలకు అందజేయవలసిందిగానూ సమావేశం మరో తీర్మానంలో ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది.

ప్రధానకార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి విద్యారంగసమస్యల్ని, ఇతర కార్యక్రమాల్ని సమీక్షిస్తూ నివేదిక సమర్పించారు. శ్రీ మైనేని పత్రికా రిపోర్టు సమర్పిస్తూ జనరల్ క్యాంపెయిన్‌ని కూడా దిగ్విజయం చేయవలసిందిగా విజ్ఞప్తి చేశారు. శ్రీ యం. నరహరి హైదరాబాద్ సబ్ ఆఫీసు నివేదిక సమర్పించారు. చర్చల్లో సర్వశ్రీ తిరుపాలు (నెల్లూరు) సీతారామాచారి (కృష్ణా) అంజిరెడ్డి (గుంటూరు) రామిరెడ్డి (ప్రకాశం) లక్ష్మయ్య (ఖమ్మం) సుబ్బరాజు, పోలిసెట్టి (ప. గో.) పాల్గొన్న పిదప నివేదికలు ఆమోదింపబడ్డాయి.

సమావేశ ప్రారంభంలో ఇటీవల మరణించిన సోవియట్ ప్రధానమంత్రి శ్రీ అలెగ్జి కొసిగిన్ మరణానికి, అలాగే యు.టి.యఫ్ రాష్ట్రకౌన్సిలర్ శ్రీ పకీరయ్య అకాలమరణానికి, ఆర్ట్స్ మరియు క్రాఫ్ట్ ఉపాధ్యాయసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ మస్తానయ్య మృతికి ప్రగాఢ సంతాపాన్ని తెల్పుతూ సమావేశం శ్రద్ధాంజలి ఘటించింది.

పైవాటితోపాటు ఈ క్రింది తీర్మానాలు ఆమోదింపబడ్డాయి.

(1) 1973 కి పూర్వం రిటైరయిన ఉపాధ్యాయులకు కూడా కుటుంబపెన్షన్ పథకాన్ని వర్తింపజేయాలి. (2) కేంద్ర ప్రభుత్వ పద్ధతిలో కుటుంబ సంక్షేమ పథకం అమలుపరచాలి. (3) తెనాలి శ్రద్ధానందకాలనీ గరల్స్ హైస్కూలు, హైదరాబాద్‌లో సెయింట్ గాబ్రియల్ ఎడ్యుకేషనల్ సెంటర్ హైస్కూలు ఉపాధ్యాయులు తమ న్యాయమైన హక్కులకోసం పోరాటం సాగిస్తున్నారు. ఈ సమావేశం తన పూర్తిసహకారాన్ని ప్రకటిస్తూ వారి సమస్యల్ని తక్షణం పరిష్కరించ వలసిందిగా ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నది. (4) గుంటూరుజిల్లా తాడికొండ సమితి ఉపాధ్యాయులు 21-1-81 నుండి ప్రత్యక్షచర్యకు సిద్ధపడుతున్నారు. వారి నిర్ణయాన్ని ఈ సమావేశం సమర్థిస్తూ ఆ టీచర్ల న్యాయమైన కోర్కెల్ని ఆమోదించి ప్రశాంతవాతావరణాన్ని కల్పింపవలసిందిగా జిల్లా, సమితి అధికారులను డిమాండ్ చేస్తున్నది. (5) పశ్చిమగోదావరి జిల్లాలో ప్రయివేటు పాఠశాలల యాజమాన్యాలు అనేక దురాగతాలకు పాల్పడుతున్నాయి. వాటిని అరికట్టడంలో శ్రీ డి.ఇ.ఓ విఫలురయ్యారనీ, ఇప్పటికైనా ఆయన తన అధికారాన్ని వినియోగించి ఉపాధ్యాయుల హక్కుల్ని ఉద్యోగాల్ని కాపాడవలసిందిగా శ్రీ డి.ఇ.ఓ. గార్ని సమావేశం, కోరుతున్నది.

## నెల్లూరు జిల్లా పరిషత్తులో అక్రమ బదిలీలు రద్దు

### యు. టి. యఫ్. ఘనవిజయం

నెల్లూరు జిల్లాపరిషత్తులో కలెక్టరు ప్రమేయంతో ఆగస్టు 15 తర్వాత జరిగిన బదిలీలు రద్దుచేయాలని యు. టి. యఫ్ సాగించిన నిర్విరామపోరాటం ఘనవిజయంగా ముగిసింది. గతమూడు నెలలుగా అన్ని స్థాయిల్లో జరిగిన పోరాట ఫలితంగా ఇది సాధ్యమయింది. జిల్లా కలెక్టరు గార్కి, జడ్.పి అధికార్లకు చేసిన విజ్ఞప్తులు హెచ్చరికలు ఫలించకపోగా రాష్ట్రశాఖ పంచాయితీరాజ్ మంత్రి కార్యదర్శి గార్లకు సమస్య వివరించడం జరిగింది. వారు కలెక్టరు గార్ని సంజాయిషీ అడిగినా ఆయన దొంకతిరుగుడు సమాధానంతో కాలయాపన చేయసాగారు.

ఫలితంగా యు.టి.యఫ్. జిల్లాశాఖ బదిలీలు రద్దయ్యేవరకు సమస్యల పరిష్కారంపై ఒప్పందం కుదిరేవరకు 5-1-81 న జి.ప ఆఫీసు ఎదుట ధర్నా జరపాలని, 6-1-81 నుంచి రిలే నిరాహార దీక్షలు కొనసాగించాలని నిర్ణయించి విస్తృత ప్రచారం ప్రారంభించింది.

చివరకు అధికార్లు దిగివచ్చి 2-1-81 చర్చలకు పిలిచారు. మొత్తం బదిలీలపై సమగ్ర చర్చానంతరం ఇరుపక్షాలకు అభ్యంతరం లేనివితప్ప తక్కిన 38 బదిలీలు రద్దుచేయాలని యు. టి. యఫ్. కోరింది. ఆమేరకు 4-1-81రాత్రి అన్ని అక్రమబదిలీలు రద్దుచేస్తూ ఉత్తర్వులిచ్చారు.

5-1-80 ఉదయం రాష్ట్రశాఖ అధ్యక్ష, కార్యదర్శులు శ్రీ డి. రామిరెడ్డి, కె. తిరిపాలుగార్ల నాయకత్వాన కలెక్టరుగారితో జి. పి. అధికార్లతో సమస్యలపై చర్చలు జరిగాయి. బకాయిల చెల్లింపు, సీనియారిటీల లిస్టుల ప్రకటన, సెలక్షన్ గ్రేడు వర్తింపచేయుట మొదలైన సమస్యలపై లిఖితహామీ జి. పి. వారి నుండి పొందిన తర్వాత ధర్నా విరమిస్తూ తీర్మానించడమైనది. యు. టి. యఫ్. ఆధ్వర్యాన సాగిన ఈ పోరాటం జిల్లా ఉపాధ్యాయుల్లో అపూర్వ చైతన్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని కల్గించింది. యు.టి.యఫ్. ప్రతిష్టకు గంగవెర్రులెత్తిన కొందరు ప్రచార బ్రహ్మలైన వినాయకులు గోబెల్స్ ప్రచారానికిదిగి శృంగభంగానికి గురిఅయ్యారు.

## గ్రామాలలో ఉపాధ్యాయులకు పంచదార, కిరోసిన్ అందించాలి

### పశ్చిమ గోదావరిజిల్లా శాఖ ఆందోళన కార్యక్రమం

గ్రామాలలో ఉపాధ్యాయులకు, పంచదార, కిరోసిన్, ఇతర కంట్రోలు వస్తువులు అందుట లేదు. పెద్దలు, పెత్తందారులు వాటిని స్వాహా చేయడం, అడిగిన వారిని బెదిరించడం జరుగుతున్నది. ఈ సమస్యలపై పశ్చిమగోదావరి జిల్లాలో ఆందోళనా కార్యక్రమం చేపట్టిరి.

జిల్లా యు. టి. యఫ్. శాఖ ఈ విషయమై మహజర్లు తయారుచేసి జిల్లా యందలి ప్రాథమిక, సెకండరీ పాఠశాలల నుండి సంతకాలు సేకరించిరి. 17-1-81 తేదీన అన్ని తాలూకా కేంద్రాల లోను తహసిల్‌దారులకు మహజర్లు ఉపాధ్యాయులు ఊరేగింపుగా వెళ్ళి అందించిరి. వెంటనే తగుచర్యలు గైకొనాలని కోరిరి.

### 3 వేల సంతకాలతో కలెక్టరుకు మెమోరాండం

జిల్లావ్యాప్తంగా సేకరించిన మూడు వేలసంతకాలుగల మహజర్లు 20-1-81 తేదీన ఏలూరులో మూడువందలమంది ఉపాధ్యాయులు వూరేగింపుగా కలెక్టరు కార్యాలయమునకు వెళ్ళి, కలెక్టరు గారికి అందచేసిరి. శ్రీ ఎ. వెంకటస్వామి, శ్రీ కె. రాఘవరాజు, శ్రీ యస్.ఆర్. పోలిశెట్టి, శ్రీ వి. శ్రీరామమూర్తి శ్రీ కె. కోటేశ్వరరావుగార్లతో కూడిన ప్రతినిధివర్గాలు కలెక్టరుగారితో విషయములు విపులముగా చర్చించిరి.

పంచదార, కిరోసిన్, ఇతర కంట్రోలు వస్తువులు ఉపాధ్యాయులకు పక్రమంగా అందించాలని, అందుకు అందరికీ తగు ఆదేశాలు యివ్వాలని, పండగ అడ్వాన్సులు ఉపాధ్యాయులకు యిప్పించాలని, ప్రభుత్వ ఉత్తర్వులు అన్ని మేనేజిమెంట్లు సక్రమంగా అమలుజరుపునట్లు చూడాలనికోరగా అందు విషయమై తగు ఉత్తర్వులు యిస్తామని చెప్పిరి.

### ఏలూరు డి. ఇ. ఓ. ఆఫీసు ముందు ధర్నా

పశ్చిమ గోదావరి జిల్లా విద్యాశాఖాధికారి ఆఫీసులో పేరుకపోయిన అపరిష్కృత సమస్యల పరిష్కారము నిమిత్తము. నాగ్గావాలు, సమ్మెకాగా జిల్లా యు.టి యఫ్. శాఖపక్షన 20-1-81న 200మంది ఉపాధ్యాయులతో డి.ఇ.ఓ. ఆఫీసుముందు ధర్నాజరిగింది.

ధర్నా శిబిరమునకు శ్రీ కె. రాఘవరాజుగారు అధ్యక్షత వహించగా, శ్రీ ఎ. వెంకటస్వామి (రాష్ట్రసంఘ ప్రధానకార్యదర్శి) శిబిరమును ప్రారంభించిరి. శ్రీ యస్ ఆర్. పోలిశెట్టి ధర్నా సమస్యలు విపులంగా వివరించిరి. వివిధ సంఘాల నాయకులు సందేశాలు యిచ్చిరి.

నినాదములతో శిబిరాలు మారుమ్రోగిపోయినవి. మధ్యాహ్నం ధర్నా శిబిరాలలోని ఉపాధ్యాయులు డి. ఇ. ఓ ఆఫీసును చుట్టుముట్టి, అవినీతిపైనను, అలక్ష్యంపైనను, సమస్యల పరిష్కారం గురించి నినాదములతో మించెత్తిరి. ఆఫీసు దద్దరిల్లిపోయినవి. డి. యి. ఓ. గారు బయటకువచ్చి సంప్రతింపులకు ఆహ్వానించిరి.

సంప్రతింపులలో డి.ఇ ఓ. గారు. చేసిన పనులు వివరించిరి, కోరుకొల్లు మేనేజిమెంటుపై తగు చర్య గైకొనమన్నట్లు, శ్రీ శ్రీరామమూర్తి శ్రీమతి సుబ్బలక్ష్మి, శ్రీమతి సుగుణావతిగార్ల

---

**ముఖ్య సవరణ**

**అధ్యాపకదర్శిని— 4 భా.లో**

**(పెన్షన్ సర్వస్వం)**

(1) పేజీ 180లో - పెన్షన్ ఫారం

1-9-77 నుండి 31-3-78 వరకు డి. ఎ రు. 1683 బదులు రు. 158 గా సవరించుకోవాలి. 157వ పేజీలో వివరించినట్లు నగటు జీతం, పెన్షన్ వ్రాసుకోవాలి.

(2) అలాగే వాలంటరి రిటైరు అయిన వారికి కూడా పెన్షన్ కమ్యూటేషన్ వర్తించును.

---

పునర్నియామకమునకై తగు చర్యలు గైకొంటున్నట్లు వ్రాతపూర్వకముగా యిచ్చిరి.

ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతపు బిల్లులు సక్రమముగా చెల్లించుటగురించి 79 డిసెంబరు 14 జీతము చెల్లింపు గురించి, భీమవరం యస్.జె.బి యం. ఉపాధ్యాయుల సమస్యలు స్వయముగా వెళ్ళి పరిశీలించి పరిష్కరిస్తానని, పాలకొల్లు కమీషనరుగారికి డ్యూటీ అలవెన్సు చెల్లించుటకు ఉత్తర్వులు యిస్తానని అభ్యుదయ పాఠశాలలఉపాధ్యాయులకు పిక్సేషనుఏరియర్సు వెంటనే చెల్లిస్తానని, వారి శంపులు యింక్రిమెంట్లు వెంటనే చేయిస్తానని, జిల్లా అంతటా కంటింజెన్సీ రేట్లు, స్వీపరుపార్టీలు పెంచుతూ ఉత్తర్వులు యిస్తానని, మిగిలిన సమస్యలపై 30 వ తేదీన తిరిగి సమావేశమై చర్చించి తగు నిర్ణయాలు తీసుకొందామని చెప్పిరి.

అందుచే తరువాతదశ పోరాట కార్యక్రమాన్ని వాయిదావేసు కొనవలసినదిగా కోరిరి. జిల్లా కార్యవర్గాలు సమావేశమై పరిస్థితులను సమీక్షించి ఈలోగా సమస్యలు పరిష్కారం కానిచో ఫిబ్రవరి 9 వ తేదీ నుండి మరింత తీవ్రతరకార్యక్రమం చేపట్టాలని నిర్ణయించింది.

### భీమవరంలో మహాసభల సంరంభం

యు. టి. యఫ్. పశ్చిమగోదావరి జిల్లాశాఖ కౌన్సిలు సమావేశం డిసెంబరు 7న శ్రీ కె. రాఘవరాజుగారి అధ్యక్షతన అత్యంత ఉత్సాహపూరితంగా జరిగింది. 250 మంది సభ్యులు పాల్గొనిరి. శ్రీ యస్. ఆర్. పోలిశెట్టి జిల్లా ఉద్యమాన్ని సమీక్షించిరి. అన్ని ప్రాంతాలలోను ఉద్యమం పురోగమిస్తున్న వివరాలు యిచ్చిరి.

శ్రీ ఎ. వెంకటస్వామి (రాష్ట్ర ప్రధాన కార్యదర్శి) శ్రీ పి.వి. సుబ్బరాజు (ఉపాధ్యక్షులు) రాష్ట్ర ఉద్యమం 23 జిల్లాలలోను శరవేగంతో పురోగమిస్తున్న విధం. పత్రిక ప్రభావం, అధ్యాపక దర్శని ఆదరణ వివరించిరి. భీమవరంలో యు.టి.యఫ్. తృతీయ విద్యా వైజ్ఞానిక మహాసభల జయప్రదానికి చేయవలసిన ఏర్పాట్లు, వివరించిరి.

చర్చలలో శ్రీయుతులు సుబ్బారావు, శర్మ, సుభాసచంద్ర బోసు, కామేశ్వరరావు, రామిరెడ్డి, గాదిరాజు, డేవిడ్, డి. డి ఎన్. రావు, జి.ఎన్. ప్రసాద్, కష్ణమూర్తి రామకృష్ణ, ఉమామహేశ్వర రావు, రాఘవరాజు, సత్యనారాయణమూర్తి, శ్రీరామమూర్తి, రామారావు, విశ్వనాథరాజు, వై. వెంకటరావు, రామరాజుగారలు, శ్రీమతి ఎ. అనసూయగారు మాట్లాడుతూ మహాసభలకు అన్ని ఏర్పాట్లు

చేయుటకు సంసిద్ధతను తెల్పిరి. సమితుల వారిగా కోటాలు తీసుకొనిరి.

సభ్యత్వ పత్రిక, జనరల్ ఫండు కాంపెయిన్లు యిలాగా జయప్రదంగా నిర్వహించుటకు సంసిద్ధతను తెల్పిరి.

డిశంబరు 26న జరిగిన సబ్ కమిటీలో అహ్వాన సంఘ ఏర్పాట్లు గురించి తగుచర్యలు గైకొనిరి. అన్ని శాఖలు అప్పుడే మహాసభల సంరంభంలో ప్రవేశించాయి.

## వరంగల్ జిల్లా శాఖ సమావేశం

తేదీ 4-1-1981న వరంగల్ మహబూబియా ఉన్నత పాఠశాలలో జిల్లా, సమితి, పట్టణ కన్వీనర్ల కార్యకర్తల సమావేశము జరిగినది. శ్రీ యస్. సోమయ్య అధ్యక్షులుగా వ్యవహరించిరి. శ్రీ వై. జి. శౌరయ్య రాష్ట్రకార్యవర్గసభ్యులుముఖ్య అతిధిగాహాజరయిరి.

జిల్లా కమిటీ కన్వీనరు శ్రీ యం. సుదర్శనం నివేదిక సమర్పిస్తూ ఉపాధ్యాయులు తమ సమస్యలను ఉద్యమాల ద్వారా పరిష్కరించుకొనాలని, కార్యకర్తలు చురుకుగా కదిలి పనిచేస్తేతప్ప ఉద్యమం ముందుకుపోజాలదని సమాజంలో భాగమైన ఉపాధ్యాయుల శ్రేయస్సు తోకూడిన సమాజ శ్రేయస్సుతో ముడిపడి వున్నదని అందుకు ఉపాధ్యాయులు నవసమాజ నిర్మాణానికి పాటుపడే మిత్రులతో కలిసి ప్రయాణం చేయాలని కోరారు. వివిధ కార్యాలయాలలో పెండింగులోవున్న సమస్యల పరిష్కారార్థం పోరాటకార్యక్రమాలు నిర్వహించాలని అభ్యర్థించారు.

తదనంతరం సభ్యులు సుదీర్ఘ చర్చలు జరిపి కన్వీనర్ నివేదిక, ఆర్థిక రిపోర్టును ఏకగ్రీవముగా ఆమోదించిరి.

వివిధ సమితి పట్టణశాఖల కన్వీనర్లు తమతమ రిపోర్టులనుయిచ్చిరి. శ్రీయుతులు ఎ. ఎల్. కాంతారావు, వై. జి. శౌరయ్య, డి. సూర్యనారాయణ (వరంగల్) శ్రీ జె కనకయ్య (హన్మకొండసిటీ) ఎం. బాలయ్య (హన్మకొండ సమితి) కె సోమయ్య, జి. శంకరరావు (ములుగు) జి. భద్రయ్య, ఎస్. భద్రయ్య (వర్ధన్నపేట) సి. హెచ్ సుదర్శనం, బి రాజమల్లు (శాయంపేట) ఎస్. నరసయ్య (చేర్యాల), టి. కృష్ణమూర్తి (మహబూబాబాద్, మరిపెడ) ఎం. సుదర్శనం, (కొడకండ్ల పశ్చిమ) కె. సోమయ్య (జనగామ పశ్చిమ) వై. జి. శౌరయ్య (నర్సంపేట పశ్చిమ) తమ తమ రిపోర్టులను సమర్పించిరి.

శ్రీ టి. కృష్ణమూర్తి జిల్లా కమిటీ సభ్యులు ప్రవేశపెట్టిన ఈ క్రింది తీర్మానములు సభ ఆమోదించినది.

1. వరంగల్ జిల్లా లోకల్ ఫండు కార్యాలయములో పంచాయితీ సమితి పాఠశాలల ఉపాధ్యాయులకు గ్రాంట్లు మంజూరు చేయుటలోగల అవకతవకలకు వెంటనే స్వస్తి చెప్పాలని అధికారులను కోరుతూ తీర్మానించబడింది.

2. బి యి.డి శిక్షణ పొందిన ఉపాధ్యాయుల పోస్టులను వారి ఉత్తీర్ణతతేదీ నుండి అప్ గ్రేడు చేయాలని

3. ఇంటిఅద్దె అలవెన్సు అన్నిగ్రామీణ ఉపాధ్యాయులకు వర్తింపచేయాలని

4. ఉపాధ్యాయుల పిల్లలకు యూనివర్సిటీస్థాయివరకు ఉచిత విద్యాసౌకర్యం అమలు జరపాలని

5. బాలసేవికా శిక్షణ పొందిన వారికి ఉద్యోగావకాశాలు కల్పించాలని

6. లీవు ట్రావెల్ సౌకర్యం పంచాయితీరాజ్ ఎయిడెడ్ ట్రైబల్ వెల్ ఫేర్ ఉపాధ్యాయులకు వర్తింపజేస్తూ టీచింగ్ గ్రాంటు నుంచి నిధులు మంజూరుచేయాలని

7. పంచాయితీ రాజ్ ఉపాధ్యాయులకు పండుగ అడ్వాన్సు సమితి, పరిషత్ కార్యాలయాలలో సాధారణ నిధుల కొరత కారణంగా చాలా కాలంనుండి ఇచ్చుటలేదు. అందుకు ప్రత్యేకముగా నిధులు కేటాయించాలని.

8 పండిత శిక్షణ పొంది సెకండరీ గ్రేడు పోస్టులలో పని చేయు గ్రాడ్యుయేటు ఉపాధ్యాయులకు ఎస్.జి బి టి. లేక టి.టి.ఐ. శిక్షణ లేదనే కారణంతో వార్షిక ఇంక్రిమెంట్లు ఇవ్వక పోవడం వారి సర్వీసులను క్రమబద్ధము చేయకపోవడం పట్ల ఆందోళన వ్యక్తపరుస్తూ అట్టివారిని క్వాలిఫైడు ఉపాధ్యాయులుగా గుర్తిస్తూ నియామకపు తేదీలనుండి వార్షిక ఇంక్రిమెంట్లు మంజూరు చేయాలని.

9. తేదీ 1-4-1973 కు ముందు రిటైరైన లేక మరణించిన ఎయిడెడ్ ఉపాధ్యాయులకు ఆం.ప్ర. లిబరలైజ్డు పెన్షన్ రూల్సు 1961 వర్తింపజేయాలని

10. బొంబాయి హిందీ విద్యాపీఠము యొక్క సాహిత్య సుధాకర్, భాషారత్న పరీక్షల గుర్తింపులను పునరుద్ధరించాలని ప్రస్తుతం ఇట్టి అర్హతలతో సర్వీసులో వున్న ఉపాధ్యాయులకు ప్రమోషన్ సౌకర్యం కల్పించాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించనైనది.

జిల్లా విద్యాశాఖాధికారిగారిని కోరుచూ :

1. ప్రభుత్వ ప్రాధమికోన్నత పాఠశాల షేరక్ (ఆర్.ఇ.సి) వరంగల్ ప్రధానోపాధ్యాయులు తన సహ ఉపాధ్యాయులపట్ల అనుచిత ప్రవర్తన, కక్షసాధింపు ధోరణి, వేతన పంపకములో విలంబనము మొదలుగాగల కవ్వింపు చర్యలను ఖండిస్తూ తీర్మానించబడినది. ఆ పాఠశాల ఉపాధ్యాయులు సమర్పించిన వినతి పత్రముపై డి.ఇ.ఓ.గారు స్వయముగా విచారణ జరిపి ఆ ప్రధానోపాధ్యాయునిని వెంటనే బదిలీ చేయాలని కోరుచూ తీర్మానించడమైనది.

2. ఎ. సుందరరాజు, హి. పం. గ్రేడు 2, జి. ప. ఉ. పాఠశాల, వర్ధన్నపేటగారికి ప్రత్యేక అలవెన్సు వెంటనే మంజూరు చేయాలని

3. శ్రీ సి. హెచ్. గురులింగం, ప్ర ఉ.పి ఎన్ వెంకంపాడ్ మరిపెడ సం.వ.గారి వినతిపత్రమును విచారించి వారి వేతనస్థిరీకరణ తన జూనియర్ శ్రీ కె. తిరుపతయ్య వ. ఉ. ప్రా. ఉ పాఠశాల హన్మకొండ సం. వ. గారి మాదిరిగా జరుపాలని కోరుతూ తీర్మానించనైనది.

జిల్లాపరిషత్ ఉపముఖ్యకార్యనిర్వహణాధికారి గారిని కోరుచూ:-

1. శ్రీ ఎస్. సాయన్న తె. పం. గ్రేడు అ. ప్ర. సె. పా. పెంబర్తి గారికి ప్రమోషన్‌లో జరిగిన అన్యాయాన్ని సవరిస్తూ ఉత్తర్వులిస్తామనియిచ్చిన హామీనిత్వరలో అమలుపర్చాలని కోరుతూ

2. ఉపాధ్యాయులకు సాధారణ నిధి నుండి దశల వారిగా పండుగ అడ్వాన్సు యిచ్చు ఆనవాయితీని పునరుద్ధరించాలని.

3. శ్రీమతి రత్నమాల హి. ప. గ్రేడు 2 మల్కాపూర్ మరియు శ్రీ సి. కాంతయ్య, ఎస్. ఎ. II గార్లు జి ప సె పా. తరిగొప్పుల గారల పేర్లు డి.ఎస్ సి. లిస్టులో చేర్చ ప్రకటించాలని కోరుతూ తీర్మానించనైనది.

## చిలకలూరిపేట సమితిశాఖ సమావేశం

చిలకలూరిపేట సమితిశాఖ సమావేశం 18-1-81 న జగ్గయ్యపేటలో శ్రీ కె. వర్సయ్యగారి అధ్యక్షతన జరిగినది. శ్రీ పి. వీరభద్రయ్యగారు సమితి కార్యకలాపాలపై నివేదిక ప్రవేశపెట్టిరి.

శ్రీ ఎ. వెంకటస్వామి (రాష్ట్రశాఖ ప్రధాన కార్యదర్శి) శ్రీ యన్. రామకోటేశ్వరరావు (జిల్లాశాఖ అధ్యక్షులు) శ్రీ సి.హెచ్. సుబ్బారావు (జిల్లాశాఖ ఉపాధ్యక్షులు) రాష్ట్రజిల్లా ఉద్యమాలను సమీక్షించిరి.

నివేదికలపై చర్చలలో పాల్గొంటూ శ్రీయుతులు టి. సత్యనారాయణ, పి. హెచ్. కృష్ణంరాజు, యస్. సాంబశివరావు, సి. రామారావు, యస్.ఎ. ఘని, యం. ముకేశ్వరరావు, రంగనాథస్వామి, పి. శౌరిగారలు సమస్యలు వెంటనే పరిష్కరించాలనికోరిరి.

చర్చల అనంతరం, సభ్యత్వ, పత్రికా కాంపెయిన్ల జయప్రదానికి కార్యక్రమం తీసుకొనిరి.

## తెనాలిలో బ్రహ్మాండమైన ఊరేగింపు

తెనాలి శ్రద్ధానంద హరిజనకాలనీ హైస్కూలు మేనేజిమెంటు అక్రమాలకు గురియై ఉద్యోగాలు కోల్పోయిన 5గురు 12 నెలలుగా జీతాలులేక, బాధలు పడుతున్నారు. డిపార్టుమెంటు ఉత్తర్వులు కూడా అమలుజరుపని మేనేజిమెంటు వైఖరిపై నిరసనగానూ, అధికారులు తగుచర్యలు వెంటనే గైకొనాలని, జనవరి 4నుండి రిలేనిరాహారదీక్షలు సాగించుచు జనవరి 19న 500 మందితో బ్రహ్మాండమైన వూరేగింపు జరిపి, పుర ప్రముఖులను, రాజకీయ పార్టీలను, పిలిచి బహిరంగసభ జరిపిరి, అన్ని ఉపాధ్యాయ సంఘాలు యీ పోరాటం ఐక్యంగా నిర్వహించాయి.

అమనగల్ సమితి శాఖ : 6-1-81 న సమితి కార్యవర్గ సమావేశం శ్రీ బి. బాలయ్యగారి అధ్యక్షతన జరిగింది. జిల్లా శాఖ ప్రధానకార్యదర్శి శ్రీ యస్. విజయకుమార్ హాజరై సందేశమిచ్చారు. శ్రీ మల్లయ్య కార్యదర్శి నివేదిక సమర్పించారు. చర్చల్లో సర్వశ్రీ ఆశీర్వాదం, బ్రహ్మానందం (కలగొండ) మోహన్‌రావు, మోహన్ రెడ్డి, వెంకటరెడ్డి, మధుసూదనరావు, కె వెంకటరెడ్డిగార్లు పాల్గొని ఉద్యమాభివృద్ధికి తగుసూచనలు చేశారు.

ఆకివీడు సమితిశాఖ (ప గో) : 25-12-80 న భీమవరంలో శ్రీ యం పి. హెచ్. రామసోమయాజిశాస్త్రి అధ్యక్షతన కార్యవర్గ సమావేశం జరిగింది. ప్రధాన కార్యదర్శి కృషి నివేదిక సమర్పిస్తూ రాష్ట్ర మహాసభల్ని జయప్రదం చేయటానికి కార్యక్రమం తీసుకోవాలన్నారు. జిల్లాశాఖ అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు శ్రీ కె. రాఘవరాజు, శ్రీ పోలిసెట్టిగార్లు డి.ఇ.ఓ ఆఫీసుముందు చేయబోవు ధర్నా పోరాటాన్ని వివరించారు. రాష్ట్రశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ.వి. స్వామి, తూ.గో. జిల్లా ప్రధానకార్యదర్శి శ్రీ వి. సూర్యనారాయణరాజుగార్లు మహాసభ ప్రాధాన్యతను వివరించి సందేశమిచ్చారు.

వర్ధంతిసభ: సూర్యాపేట(నల్గొండ)పట్టణంలో 12-12-80న సంఘ కార్యాలయంలో వర్ధంతిసభ శ్రీ కె. సుబ్బారావుగారి అధ్యక్షతన జరిగింది. సర్వశ్రీ ఎ. అప్పారావు, భాస్కరరాజు, సీతారాంరావు, వి. సత్యనారాయణగార్లు అమరజీవి చెన్నుపాటి ఆదర్శకృషిని వివరించి జోహార్లు తెల్పారు.

## వినుకొండ సమితి టీచర్స్ కో ఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ ఎన్నికలలో యం. టి. యఫ్. అభ్యర్థుల విజయం

గుంటూరుజిల్లా, వినుకొండ సమితిలో యు.టి.యఫ్. శాఖ క్రొత్తగా ఏర్పడినా కార్యకర్తలు అపారదీక్షతో, నిర్విరామకృషితో అల్పకాలంలోనే పటిష్టశాఖ నిర్మించారు. అవకాశవాద కూటమికి వ్యతిరేకంగా క్రెడిట్ సొసైటీ ఎన్నికలలో పాల్గొని సర్వశ్రీ వి. చంద్రమౌళి, డి. గాలయ్య, యన్. వెంకటరెడ్డిగార్లను గెల్పించుకొన్నారు. సంఘ ప్రతిష్ఠను నిలబెట్టిన కార్యకర్తలకు, ఓట్లువేసి గెలిపించిన ఉపాధ్యాయులకు సమితిశాఖ అభినందనల్ని తెల్పుచున్నది.

## గండిపాటిపల్లె పాఠశాల భవన నిర్మాణంలో యం.టి.యఫ్. కార్యకర్త ఆదర్శకృషి

ప్రకాశంజిల్లా, కనిగిరి తాలూకాలో ఓ మారుమూల అడవి ప్రాంతంలో గోపు సముద్రం అనే గ్రామముంది. అక్కడి ప్రజలు 20 సం॥ల నుండి పాఠశాలకోసం తపిస్తున్న స్థితిలో అక్కడికి సమీపంలోగల గుడిపాటిపల్లె కె.ఎ.యం.పి. ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూలువారు అక్కడ అన్ ఎయిడెడ్ బ్రాంచ్ పెట్టి యు.టి.యఫ్. కార్యకర్త శ్రీ కె. వెంకటేశ్వర్లుగారిని డెప్యూటీ చేశారు. ఆయన అక్కడి పాఠశాలకు స్వంతడబ్బుతో భవనం నిర్మించి, అధికారులతోగాక యు.టి.యఫ్. అధ్యక్షుడు శ్రీ డి. రామిరెడ్డిగారితో ప్రారంభోత్సవం జరిపించి నూతనసాంప్రదాయాన్ని నెలకొల్పారు. పాఠశాల నిర్వాహకులు, గ్రామస్తులు ఆ సత్కృషిని అభినందించారు.

## అనంతపురం జిల్లాశాఖచే రాయబారాలు

జిల్లాశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ బి. నరసప్ప శ్రీ యం. మాధవరావు (యం.యల్.సి) రాష్ట్రకార్యదర్శి శ్రీ పి సత్యనారాయణగార్లు కలసి అనంతపురంజిల్లా సమస్యలపై విద్యాశాఖ కార్యదర్శి, పాఠశాలల డైరెక్టర్ పంచాయతీరాజ్ కార్యదర్శి, వైద్య ఆరోగ్యశాఖ కార్యదర్శి, లోకల్‌ఫండ్ ఆడిట్ ఆఫీసర్, మొదలగు అధికారులతో డిసెంబర్ 26నుండి 29 వరకు రాయబారాలు జరిపారు. 1-5-80 నుండి 5-6-80 వరకు జనాభాలెక్కల సందర్భంలో లీవు రిజర్వేషన్, పెనుగొండ సమితికి చెందిన టీచర్ల జీతాల మంజూరు, లక్ష్మీదేవమ్మగారి అప్పీలు, ఇతర రాష్ట్రాల్లో కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు చేయించుకొన్న ఆంధ్రఉద్యోగులకు ప్రోత్సాహక ఇంక్రిమెంట్లు సి.డి.మొత్తాలు, మొదలగు సమస్యల్ని చర్చించి త్వరలో వాటిని పరిష్కరించాలని కోరటం జరిగింది.

ఆదిలాబాద్ జిల్లాశాఖ : 30-11-80న జిల్లాశాఖ కార్యవర్గ సమావేశం శ్రీ వి. సుబ్బారావు అధ్యక్షతన మంచిర్యాలలో జరిగింది. వివిధ కాంపెయిన్ల విజయానికి ఆ సమావేశంలో నిర్ణయాలు తీసుకొన్నారు.

ఆదిలాబాద్ నగరశాఖ : శ్రీ రాజమల్లుగారి అధ్యక్షతన 17-12-80న నగరశాఖ కార్యవర్గ సమావేశం జరిగింది. ప్రధాన కార్యదర్శి శ్రీ గంగన్న కృషి నివేదిక సమర్పించారు. జీవితచందాల స్కీము మాతన సంవత్సరంలో నడపాలని, జి ఒ యం.యస్ 2069 ప్రకారం ప్రమోషన్కై డి. ఇ. ఓ. గారితో రిప్రజెంట్ చేయాలని నిర్ణయాలు తీసుకొన్నారు.

ధర్మవరం సమితి: (అనంతపూర్) 28-12-80న సమితి యు. టి. యఫ్. శాఖ పక్షాన శ్రీ బి.డి.ఓ. గారితో వివిధ సమస్యలపై రాయబారాలు జరిపారు. వారం లోపల అప్లికేషన్‌లు పంపి సి. డి. పాసన్ఇస్తామని, సమస్యల్ని సత్వరం పరిష్కరిస్తామని శ్రీ బి.డి.ఓ. హామీయిచ్చారు. సర్వశ్రీ బి. వెంకట సుబ్బయ్య (జిల్లా శాఖ అధ్యక్షుడు) జె. నాగరత్నం (సమితి శాఖ కార్యదర్శి) బి. నాగయ్య, వై. వెంకటాచలం, మదార్‌సాబ్, వెంకటనారాయణరావు రాయబార వర్గంలో పాల్గొన్నారు.

## విద్యాశాఖ సహాయ మంత్రితో నిజామాబాద్ జిల్లా యం.టి.యఫ్.శాఖ రాయబారం

జిల్లాశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ పి. అమరేశ్వరరావు, నగర శాఖ కార్యదర్శి శ్రీ బి. జీవన్‌గార్లు ఇతర కార్యకర్తలతో కలిసి నిజామాబాద్ గెస్టు హౌస్‌లో విద్యాశాఖ సహాయ మంత్రి శ్రీ యం. శ్రీనివాసరావుగారికి జిల్లా ట్రెజరీ అధికారి మొండివైఖరిని నివేదిస్తూ వ్రాతపూర్వకంగా ఫిర్యాదు చేశారు. దానిపై మంత్రిగారు చర్య తీసుకోగా డి.యి.వో.గారు స్వయంగా వచ్చి సమస్య పరిష్కరించానని వ్రాతపూర్వకంగా తెల్పారు. శ్రీ బి. జీవన్‌గారు పట్టణంలోని పాఠశాలల భవనాలు, ఇతర వసతుల హీనస్థితిని గూర్చి మంత్రిగారి దృష్టికి తెచ్చారు.

అరోజు ఐ.బి. కార్యాలయంలో జరిగిన జిల్లా అధ్యాపకుల, అధికారుల సమావేశంలో వివిధ విద్యా సమస్యలపై చర్చలు జరిగాయి. జిల్లాశాఖకార్యదర్శి శ్రీ బి. బాలయ్య ప్రసంగిస్తూ డి.యి.ఓ. ఆఫీసులో జరుగుతున్న అన్యాయాల్ని, సమస్యా పరిష్కారమార్గాల్ని మంత్రిగారి దృష్టికి తెచ్చారు. అధికారుల్ని హెచ్చరిస్తూ మంత్రిగారు జాప్యం లేకుండా సమస్యల్ని పరిష్కరించాలని ఆదేశించారు.

## మాడుగుల సమితికి యం.టి.యఫ్ విస్తరణ

విశాఖజిల్లా మాడుగుల సమితిలో జనవరి 10వ తేదీన ఉపాధ్యాయుల సమావేశం జరిగింది. సభకు 60మంది టీచర్లు హాజరయ్యారు. రాష్ట్ర కార్యవర్గ సభ్యులు శ్రీ ఎ. బాబూరావు యు. టి. యఫ్. కార్యక్రమాన్ని వివరించిన తర్వాత హాజరయిన వారందరూ సంఘ సభ్యత్వాన్ని స్వీకరించారు. పిదప అధ్యక్షులు శ్రీ డి. సాంబశివరావు, ఉపాధ్యక్షులుగా శ్రీ జి.బి.వి రామయ్య, ప్రధాన కార్యదర్శిగా శ్రీ యం.వి.యల్. పట్నాయక్, కార్యదర్శిగా శ్రీ పి బి. పాల్, శ్రీ జి. ఇబ్రాయిల్ గార్లతో తాత్కాలిక కమిటీ ఎన్నుకోబడింది. స్థానిక యు. పి. స్కూలు టీచర్లు ఇతరుల సహకారంతో భోజన ఏర్పాటు చేశారు.

## ఉపాధ్యాయుని భార్యపై అత్యాచారం

అశ్వారావుపేట సమితి ప్రాథమికోన్నత పాఠశాల, పట్వారిగూడెంలో పని చేయుచున్న శ్రీ గురునాథం గారి భార్యపై ఎల్లయ్య అనే కోయ జరిపిన అత్యాచారమును, సమితిలోని ఉపాధ్యాయ సంఘాలు తీవ్రంగా ఖండిస్తూ నేరస్తుని కఠినంగా శిక్షించాలని జిల్లా కలక్టర్, డి.యస్.పి గార్లను కోరుట జరిగినది.

## శ్రీ జి. పి. వస్తానయ్య ఆకస్మిక మరణంపట్ల తీవ్ర సంతాపం

ఏ.పి. ఆర్ట్స్, క్రాఫ్ట్స్ టీచర్స్ అసోసియేషన్ ప్రధాన కార్యదర్శి స్టేట్ కార్యవర్గసభ్యుడు శ్రీ జి.పి. వస్తానయ్య గుండెపోటుతో 18-12-80న ఆకస్మిక మరణంపాలయ్యారు. దానికి తీవ్ర విచారాన్ని తెల్పుతూ జిల్లాసంఘ అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు శ్రీ జి. వి. అప్పారావు, శ్రీ బి రామకోటయ్య, రాష్ట్రసంఘ ఉపాధ్యక్షులు శ్రీ బి. లోకనాథం తమ తీవ్రసంతాపాన్ని తెలపుతున్నారు.

సోదర సంఘప్రధాన కార్యకర్త మరణానికి యు.టి.యఫ్ పక్షాన ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి తమ తీవ్ర సంతాపాన్ని తెలుపుతున్నారు. తెనాలి పట్టణ ఉపాధ్యాయసంఘాలు సంయుక్తంగా సమావేశం జరిపి తమ సంతాపాన్ని ప్రకటించారు.

## కార్యకర్తలకు - చందా దారులకు

1. పత్రిక సొమ్ము బ్యాంకు డ్రాఫ్టు ద్వారా అయిన "IKYA UPADHYAYA" అను పేర క్రాసు చేసి, యం. ఓ. ద్వారా అయిన "ఎడిటర్, ఐక్య ఉపాధ్యాయ, పాలపర్తివారివీధి విజయవాడ-2" అని పంపాలి.

2. సంఘము సొమ్ము బ్యాంకు డ్రాఫ్టుద్వారా అయిన "A. P. United Teacher's Federation" అను పేర క్రాసుచేసి; యం. ఓ. ద్వారా అయిన "ప్రధాన కార్యదర్శి, యు టి. యఫ్. పాలపర్తివారి వీధి,విజయవాడ - 2" అని పంపాలి.

3. అధ్యాపక దర్శిని (జి. వో. ల పుస్తకం) సొమ్ము డ్రాఫ్టు ద్వారా అయిన "IKYA UPADHYAYA PRACHURANALU" అను పేర క్రాసుచేసి, ఎం. ఓ. ద్వారా అయిన "మేనేజరు, ఐక్య ఉపాధ్యాయ ప్రచురణలు పాలపర్తివారివీధి విజయవాడ-2" అని పంపాలి.

4. చెన్నుపాటిభవననిధికి బ్యాంకుడ్రాఫ్టుద్వారా అయిన "A. P. U. T. F. Chennupati Building Fund" అను పేర క్రాసుచేసి, యం.ఒ. అయిన "ప్రధాన కార్యదర్శి యు. టి. యఫ్. పాలపర్తివారి వీధి, విజయవాడ-2" అని పంపాలి.

5. డ్రాఫ్టులు ఏ బ్యాంకునుండి అయినా తీసి పంపవచ్చును. వ్యక్తుల పేర మాత్రం పంపవద్దు.

6. యం. ఓ. చేయువారు ఫారం అడుగున మీ అడ్రసు విధిగా వ్రాయాలి.

7 చందా నెంబరు లేని లెటర్లు పరిశీలింప బడవు. అడ్రసులు డూప్లికేటులో పంపిన, ఒకటి తిరిగి చందానంబర్లు యిచ్చి పంపగలం.

# సమన్వయ సమావేశాలు

భీముని సమితి (విశాఖ) : 7-1-81న జరిగిన సమన్వయ సంఘ సమావేశంలో యు. టి. యఫ్. పక్షాన 28 అపరిష్కృత సమస్యలు ఎజెండాను సమర్పించి అధికారులతో చర్చించటం జరిగింది. కొన్ని సమస్యల్ని సమావేశంలోనే శ్రీ బి.డి.ఓ.గారు పరిష్కార చర్యలు తీసుకొన్నారు. మిగిలిన వాటిని నెలరోజుల లోపల పరిష్కరింపగలమని హామీ యిచ్చారు. సంఘ పక్షాన అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు శ్రీ పి. శ్రీరామమూర్తి, శ్రీ యం. మురళీధరరావు, జిల్లా శాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. వి. సుబ్బారావు, కార్యదర్శి శ్రీ కె. శివప్రసాదరావు ఇతర కార్యవర్గ సభ్యులు హాజరై చర్చల్లో పాల్గొన్నారు.

పోరుమామిళ్ళ సమితి : (కడప) 12-12-80న జరిగిన సమన్వయ సమావేశంలో సంఘపక్షాన సర్వశ్రీ కె. పాండయ్య, యల్.పి. విక్టర్, జిల్లాశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ యస్.బి.యల్. నారాయణమూర్తి, శ్రీ సి. సుబ్రహ్మణ్యంగార్లు చర్చల్లో పాల్గొని వివిధ సమస్యల్ని అధికారుల దృష్టికి తెచ్చారు. సాధారణసమస్యలు, వ్యక్తిగతసమస్యలు వెంటనే పరిష్కరింపగలమని ఆర్థికసమస్యలు జనవరి నెలాఖరులోపల పరిష్కరిస్తామని బి.డి.ఓ. శ్రీమతి గౌషియా బేగం, యి.ఓ. (విద్య) గార్లు నిర్దిష్ట హామీలిచ్చారు.

కోవూరు సమితిశాఖ : (నెల్లూరు) 4-12-80న సమన్వయ సమావేశం జరిగింది. సంఘపక్షాన అధ్యక్షప్రధాన కార్యదర్శులు శ్రీ జె. వెంకయ్య, శ్రీ యం.డి. అబ్దుల్‌రసూల్‌గార్లు సర్వశ్రీ రెడ్డియ్య, సి.వి.యస్. చలపతిరావు, యన్. సుబ్రహ్మణ్యం, పి. రాఘవయ్య మొదలగు కార్యకర్తలు చర్చల్లో పాల్గొన్నారు సరెండర్ శెలవులు, వార్షిక ఇంక్రిమెంట్లు, యస్.ఆర్‌ల భర్తీ తదితర ముఖ్య విషయాలు చర్చించి త్వరలో పరిష్కరింపగలమని హామీలిచ్చారు.

కోవూరు సమితి శాఖ : (నెల్లూరు) 4-1-81న సమితి కౌన్సిల్ సమావేశం శ్రీ జె. వెంకయ్యగారి అధ్యక్షతన జరిగింది. ప్రధానకార్యదర్శి శ్రీ యం.డి. అబ్దుల్‌రసూల్ కృషినివేదిక సమర్పించారు. జిల్లాశాఖ పక్షాన ప్రధాన కార్యదర్శి శ్రీ పి. హెచ్. లక్ష్మీనారాయణ, కార్యదర్శి విద్వాన్ కిరణ్‌శ్రీగార్లు వివిధక్యాంపెయిన్లను దిగ్విజయం చేయాలని తెల్పుతూ సందేశాలిచ్చారు.

## గుంటూరు డి.యి.ఓ. కార్యాలయంలో సమన్వయ సమావేశం

గుంటూరు డి.యి.ఓ. కార్యాలయంలో 8-1-81న సమన్వయ సమావేశం జరిగింది. యు. టి. యఫ్. పక్షాన జిల్లాశాఖ అధ్యక్షుడు శ్రీ యం. రాయన్న, కార్యదర్శి శ్రీ యం. ఎ. కుమారదత్తు దాదాపు 25 సమస్యల ఎజెండాను సమర్పించి అధికారులతో చర్చించారు. వాటి జవాబుల్ని అధికారులు లిఖితపూర్వకంగా ఇచ్చారు. ఇవిగాక 34 వ్యక్తిగత సమస్యలపై ప్రత్యేకంగా ఇచ్చిన మెమోరాండానికి కూడా లిఖితపూర్వక జవాబులివ్వటంజరిగింది. సమస్యల్లో ఎయిడెడ్ టీచర్ల జీతాలు, పే ఫిక్సేషన్, హెచ్.ఆర్.ఎ, పబ్లిక్ పరీక్షల్లో ఇన్విజిలేటర్లకు రెమ్యూనరేషన్, సెలక్షన్ గ్రేడ్లు, ఎ.డి.ఎ చెల్లింపు, కామన్ ఎగ్జామినేషన్ అవకతవకలు, 50 శాతం డి.ఎ, వ్యక్తిగత చెక్కులు మొదలగునవి ఉన్నాయి.

## మహబూబాబాద్ సమన్వయం సమావేశం

ది. 8-12-1980న మహబూబాబాద్ పంచాయితీ సమితి కార్యాలయములో ఉపాధ్యాయ సంఘాల సమన్వయ సమావేశము జరిగింది. సమితిశాఖ కన్వీనరు శ్రీ పి. చంద్రమౌళి, శ్రీ జహీరుద్దీన్ చర్చలలో పాల్గొనిరి. జిల్లాశాఖ పక్షాన శ్రీయుతులు ఎం. సుదర్శనం, టి. కృష్ణమూర్తి పరిశీలకులుగా తోడ్పడిరి. మండలాభివృద్ధి అధికారి శ్రీ కె.ఎన్. రామచంద్రరావు, విద్యావిస్తరణాధికారి శ్రీ చంద్రయ్య గార్లు నిర్వహించిరి. అనేక అపరిష్కృత సమస్యలపై చర్చలు సుమారు 8 గంటలసేపు జరిగినవి యు.టి.యఫ్. ప్రతిపాదించిన 24 సమస్యల సత్వర పరిష్కారానికై బి.డి.ఓ.గారు లిఖిత పూర్వకముగా హామీలిచ్చిరి.

(1) గృహగణన జరిపిన ఉపాధ్యాయ ఎన్యూమరేటర్లకు లీవు రిజర్వేషను ఉత్తర్వులను ఇచ్చిరి. (2) విద్యా సంవత్సరారంభములో స్టేషనరీ గ్రాంట్లు మంజూరుకాగానే సరఫరా చేయుటకు (3) ప్రభుత్వ గ్రాంటుల మేరకు బోధనోపకరణములను కొనుటకు (4) ప్రాథమికోన్నత పాఠశాలలకు అటెండరులను ఎలాట్ చేయుటకు (5) కార్మిక శ్రేణి అభివృద్ధి ప్రొసీడింగ్సు అదేనెలలో మంజూరు చేయుటకు (6) వస్తువులు తీసుకొనుటకు సమితి కార్యాలయమునకు వచ్చిన ప్రధానోపాధ్యాయులకు ప్రయాణభత్యములను చెల్లించుటకు (7) పాఠశాల భవనముల రిపేరు మరియు నిర్మాణములకు స్థానికుల సహకారముతో కృషిచేయుటకు (8) సర్వీసు పుస్తకములలో ఎంట్రీలు ఎప్పటికప్పుడు నమోదు చేయుటకు (9) జాతీయాభివృద్ధి ఋణముల బాపతు బాండ్లు 1981 జనవరి వరకు గడువు ముగిసిన పిదప సంబంధిత వ్యక్తుల జి. పి. యఫ్. లెక్కలలో జమచేయుటకు (10) ఉపాధ్యాయుల సీనియారిటీపట్టికలు సంబంధితఉపాధ్యాయులకు పంపుటకు (11) వేతనముల చెక్కులు నెల చివరిరోజున ఎన్‌క్యాష్ చేయుటకు వీలుగా అందజేయుట (12) డి. యస్ పిలో ఎన్నిక కాబడిన ఉపాధ్యాయుల లిస్టులు ప్రతి పాఠశాలకు పంపుట— మొదలుగాగల అనేక సమస్యల పరిష్కారార్థం నిర్ణయాలు తీసుకోబడినవి. ఉపాధ్యాయులకు పండుగ అడ్వాన్సు మూడుసం॥గా ఇచ్చుట లేదు. యు టి యఫ్ పక్షాన నిరసన తెలుపుట జరిగినది. కొన్ని సమస్యలపట్ల బి.డి.ఓ గారి అలక్ష్యవైఖరి ఉపాధ్యాయులపట్ల తూష్ణీభావమునకు నిరసనగా ఆందోళనా కార్యక్రమాలు చేపట్టాలని నిర్ణయము తీసుకొనుట జరిగినది.

## జీవిత చందాదార్లకు మంచి అవకాశం

అందరి కోరికపై జీవిత చందాదారులుగా చేయుటకు వ్యక్తిగత స్కీము ప్రవేశపెట్టాం. దానిని సద్వినియోగం చేసుకోగోరుచున్నాం.

మొదట రు. 30 లు చెల్లించి జీవిత చందాదారునిగా నమోదుకావచ్చు. తర్వాత వరుసగా నాల్గు నెలలు రు. 25 లు చొ॥న చెల్లించి జీవితచందాదారు కావచ్చు. అప్పుడు రిజిష్టరు నెంబరు ఇచ్చి పత్రికలో ప్రకటిస్తాం. పత్రికమాత్రం నమోదు అయినప్పటినుండి పంపిస్తాం. ఇది ఒక సం॥వరకు మాత్రమే అమలులో వుంటుంది.

ఎడిటరు,

ఐక్య ఉపాధ్యాయం.

కల్వకుర్తి సమితిశాఖ : (మ. నగర్) తేది 30-12-80న సమితికార్యాలయంలో శ్రీ ఓ వెంకటయ్య, బి.డి ఓ గారి అధ్యక్షతన సమన్వయ సమావేశం జరిగింది. యు. టి. యఫ్. పక్షాన సర్వశ్రీ కె. యాదగిరాచార్య, డి. వెంకటరెడ్డి, కె. కనకప్ప, యస్. విష్ణుమూర్తి, టి. కృష్ణారెడ్డి, టి. రామకృష్ణ రెడ్డిగారలు పాల్గొని వివిధ సమస్యలపై చర్చించారు. బి.డి.ఓ.గారు ఆయా సమస్యల పరిష్కారానికి గడువులను నిర్ణయించి, ఆ నిర్ణీత గడువుల లోపల అన్ని సమస్యలను పరిష్కరించుటకు తగు చర్యలు గైకొంటానని హామీ యిచ్చారు.

## చర్చించిన సమస్యలు

(1) 30 రోజుల సరెండర్ లీవు మంజూరు. (2) 1-4-66కి పూర్వపు ఏరియర్లు మంజూరు. (3) గత సం॥ వేసవి సెలవులో జనాభా లెక్కలకు సంబంధించిన డ్యూటీ చేసిన ఉపాధ్యాయులకు రిజర్వేషన్ లీవు మంజూరు. (4) గత ఆర్థిక సంవత్సరపు పాఠశాలల ఇంటి అద్దె మంజూరు. (5) 18-6-80న 2వ పోస్టు క్రియేట్ అయ్యి ప్రాథమిక పాఠశాలగా మారిన మూకురాల పాఠశాలకు డ్యూటీ అలవెన్సు (రు. 15/- పి. యం.) వర్తింపు. (6) నాలుగు నెలల క్రితం లోకల్ ఫండ్ డైరెక్టరు నుంచి మంజూరు అయి వచ్చిన పి.డి డబ్బుకు సంబంధిత ఉపాధ్యాయులకు పంపిణీ చేయుట. (7) శ్రీ డి. సుఖదేవ వర్మ, మల్లాపూర్ గారి బకాయిల బిల్లులను మంజూరీ చేయుట. (8) రెమిటెన్సెస్ సక్రమంగా పంపుట. (9) ఉపాధ్యాయుల సర్వీసు రెగ్యులరైజ్ చేయుట. (10) కి. శే భీమ్లా నాయక్ గారి సీనియర్-జూనియర్ కేసు పరిష్కరించుట.

## విశాఖజిల్లాలో యం.టి.యఫ్ ఉద్యమఉధృతి

తేదీ 28-12-80న అనకాపల్లి గవరపాలెం హైస్కూలులో విశాఖజిల్లాశాఖ కౌన్సిలు సమావేశము శ్రీ పి సాంబమూర్తి అధ్యక్షులు జిల్లాశాఖ అధ్యక్షతన జరిగెను. సుమారు 26 మంది కార్యకర్తలు హాజరైరి. రాష్ట్రకౌన్సిలు సమావేశ వివరములు రాష్ట్ర వర్కింగ్ కమిటీ వివరములను ప్రధాన జిల్లాకార్యదర్శి శ్రీ కె.వి. సుబ్బారావుచే కార్యకర్తలకు తెలియజేయబడెను. శ్రీ ఎ. బాబూరావు కార్యదర్శి జిల్లాశాఖ వారు తమ ఉపన్యాసములో ఉద్యమఅభివృద్ధికై కొన్ని సూచనలు చేసిరి. సమితిశాఖల ఖర్చులు రిపోర్టులు ప్రవేశ పెట్టిరి. ఫిబ్రవరి నెలనుంచి జిల్లాశాఖ అధ్యక్ష కార్యదర్శులిద్దరు 1 నెలరోజులు జిల్లాలోని అన్ని సెకండరీ ప్రైమరీ పాఠశాలలు తిరిగి యు టి.యఫ్ ఉద్యమ వ్యాప్తికి కృషిచేయుటకు తీర్మానించడమైనది. మాడుగుల, కె కోటపాడు యలమంచిలి, అరకు, మొ॥ నూతనశాఖల ఏర్పాటుకు కృషిచేసిన సోదర కార్యకర్తలను అభినందిస్తూ తీర్మానించడమైనది.

ఉదయగిరి సమితి : సమితిలో ఈ క్రింది సమస్యలు దీర్ఘకాలంగా పరిష్కరింపబడక ఉపాధ్యాయులు ఆందోళన చెందుచున్నారు. వీటి పరిష్కారమునకు ప్రత్యక్ష చర్యే చివరి పరిష్కార మార్గమని భావించి తేది 31-1-81 లోగా పరిష్కరింపబడనిచో తేది 2-2-81 నుండి సమితి ఆఫీసు యెదుట సమస్యలు పరిష్కారమగునంతవరకూ దశలవారి ప్రత్యక్ష ఆందోళనా చర్య జరుపుటకు సమితి శాఖ తీర్మానించి నోటీసు ఇచ్చింది.

1) తే 4-1-77 కి పూర్వము నియమింపబడిన ఉపాధ్యాయులందరికీ నియామకపు తేదీనుండి సర్వీసు రెగ్యులరైజేషను చేయుట, 2) పి. డి. సక్రమముగా చెల్లింపు (తక్కువ చెల్లించిన వారికి), 3) టి టి.ఎలు చెల్లింపు, 4) 2 సంవత్సరాల సర్వీసు నిండినవారికి ప్రొబేషను డిక్లరేషను చేయుట, 5) 1966 పూర్వపు అరియర్సు చెల్లింపు, 4) 1-5-78 నుండి హెచ్.యం. అలవెన్సుపై డి.ఏ. చెల్లింపు మొదలగు సమస్యలు నోటీసులో గలవు.

కల్వకుర్తి సమితిశాఖ (మ.నగర్) : తేది 11-1-1981న కల్వకుర్తిలో సమితిశాఖ విస్తృత కార్యవర్గ సమావేశం శ్రీ డి. వెంకటరెడ్డిగారి అధ్యక్షతన జరిగింది. ప్రధాన కార్యదర్శి శ్రీ డి. కనకప్ప కృషి నివేదికను, కార్యదర్శి శ్రీ ఎస్. విష్ణుమూర్తి పత్రికా నివేదికను సమర్పించారు. వాటిపై చర్చలు జరిగినపిదప ఆమోదింపబడ్డాయి. జిల్లాశాఖ అధ్యక్షుడు శ్రీ కె. యాదగిరాచార్య జిల్లా రిపోర్టును ప్రవేశపెట్టారు. వివిధ రిపోర్టులపై సర్వశ్రీ టి. కృష్ణారెడ్డి, ఎం. రంగారెడ్డి, పి. దక్షిణామూర్తి, జి. లక్ష్మారెడ్డి ప్రభృతులు చర్చలు జరిపారు. తదనంతరం ఈ క్రింది అంశాలపై కూలంకషంగా చర్చించి, తగు నిర్ణయాలు గైకొన్నారు.

(1) జూన్ మొదటి వారంలో భీమవరంలో జరుగనున్న తృతీయ విద్యావైజ్ఞానిక మహాసభలలో పాల్గొని జయప్రదంచేయాలి (2) మార్చి 8వ తేదీన వెల్దండ గ్రామంలో సమితిశాఖ పక్షాన జరుగనున్న విద్యాగోష్ఠిని దిగ్విజయం చేయాలి (3) శ్రీ హంసవాదం, కొత్తకోటగారికి జరిగిన అన్యాయాన్ని బి డి.ఓ గారి దృష్టికి తెచ్చి న్యాయం కలగించాలి (4) శ్రీ సి. దక్షిణామూర్తిగారి ఫ్యామిలీ ప్లానింగ్ ఇంక్రిమెంటు రేటును రివైజ్ చేయించాలి.

పొదిలి సమితిశాఖ : పొదిలి సమితి విస్తృతసమావేశము 18-1-81 న పొదిలి ఎ.బి యం యు పి. స్కూలులో కె. రంగారెడ్డి గారి అధ్యక్షతన జరిగినది. సమావేశమునకు జిల్లా అధ్యక్షులు కె. బాలకోటయ్యగారు హాజరైనారు. సమావేశములో కార్యదర్శి నివేదికలో జమాఖర్చులు కరపత్రముద్వారా చెప్పడము జరిగినది.

జిల్లా అధ్యక్షులు బాలకోటయ్యగారు సంఘ నిర్మాణమును గూర్చి, జిల్లా ఆఫీసులలో మన సమస్యలు ఏ పద్ధతిద్వారా పరిష్కారము చేసుకొన్నది విపులీకరించినారు.

సమితిలో ఉపాధ్యాయులు జి. సుందరరావు, కె. కృష్ణారెడ్డి, పి హెచ్. చిరంజీవులు, యం. వెంకటేశ్వర్లు సంఘ నిర్మాణమును గూర్చి భవిష్యత్తులో చేయవలసిన కార్యక్రమాలను గూర్చి వివరించడము జరిగినది. సమావేశమునకు 60 మంది ఉపాధ్యాయులు హాజరైనారు.

---

# ప్రభుత్వ ఉత్తర్వులు

(ఉపాధ్యాయులను శలవులలో సెన్సస్ ఇతర పనులకు నియమించునపుడు లీవు రిజర్వు)

## GOVERNMENT OF ANDHRA PRADESH
## ABSTRACT

EDUCATION - Drafting of teachers during holidays for enumeration, Census etc., Reservation of leave - Orders Issued.

### EDUCATION (H) DEPARTMENT

G. O. Ms. No. 35 Dt. 16-1-1981

**ORDER :**

Under the leave rules applicable to vacation Department, teachers under all managements are eligible to earn leave of 3 days in a calendar year. When they are prevented from utilising summer vacation due to their being drafted for enumeration, Census etc., they are eligible for reservation of proportionate leave to the extent they are prevented from utilising the summer vacation. During mid-term holidays, they are being allowed to utilise compensatory leave to the extent they are prevented from utilising they mid-term holidays due to the above duties.

2. Proposals are being received by Govt. for reservation of leave in respect of teachers under different managements each time they are drafted for enumeration, preparation of electoral rolls, Census etc., during holidays.

3. Government have examined the matter and have decided to deligate powers to the heads of institutions concerned in this regard. Government accordingly authorise the heads of the educational institutions concerned to reserve proprtionate leave to the extent teachers under their control are prevented from utilising summer vacation due to enumeration, preparation or revision of electoral rolls, Census etc., based on the certificate issued by the appropriate appointing authority for such work. They are also authorised to sanction compensatory leave proportionate to the extent the teachers under their control are prevented to utilise mid-term holidays due to the said work on the strength of the certificate issued by tne said appointing autorities.

4. Government also direct that the remuneration offered for the work such as enumeration, preparation or revision of electoral rolls, Census etc., done during vacation shall not be treated as remuneration with in the scope of ruling 15 under F.R-82.

5. This order issues with the concurrence of Finance and Planning (FW. FR-I) Department-vide their U. O. No. 57972/1598/A2/FR-I/ dt. 2-1-1981.

(By order and in the name of the Governor of Andhra Pradesh)

O. BHAVANI SANKARA MURTHY
Deputy Secretary to Govt.

(టి. ఎ. నిబంధనల గురించి)

## GOVERNMENT OF ANDHRA PRADESH
## ABSTRACT

ANDHRA PRADESH Travelling Allowance Rules Revision of grades of Government servants for the purpose of travelling allowance consequent on the revision of pay scales - Amendment to Grade V in Annexure to G. O. Ms. No 258, Finance, dated 10 10-1979 - Issued.

### Finance & Plg. (T. A.) Department

G. O. Ms. No. 15 Dt. 17-1 1981

Read the following :-

1) G. O. Ms. No. 258, Finance, dt. 10-10-1979
2) G. O. Ms. No. 152, Finance, dt. 12 5-1980
3) From the Director of Local Fund Audit, A. P., Hyderabad Lr. No. Roc. 20865/E1/80-81, dt. 12-8-1980.

**ORDER :-**

According to the orders issued in the G. Os. first and second read above, officers drawing a pay of Rs. 700/- and above in the Revised Pay Scales, 1978 and holding the posts of Superintendents and above alone are eligible for travel by first class by rail in respect of journeys on duty. It has been represented to Govt. that the above classification for travel by first class denies first class travel to some officers viz., those who were drawing Rs. 430/- and above but below Rs. 600/- in the 1974 scales, though they were entitled to first class travel prior to the aforesaid classification came into force and have requested that the earlier entitlement to travel by first class by such officers may be restored.

2. Government have examined the request and have decided to allow railway travel by first class in respect of journeys on duty by all Government servants drawing a pay of Rs. 610/- and above in the Revised Scales of 1978 irrespective of the category to which they belong.

3. Accordingly Government hereby order that all Govt. employees drawing a pay of Rs. 610/- and above in the Revised Scales of 1978 may travel by first class by rail in respect of journeys on duty. These orders shall take immediate effect and all pending claims shall be disposed of accordingly. Where the claims have been finally settled already, such claims shall not be reopened.

4. The following amendment is issued to G. O. Ms. No. 258, Finance (TA) dated 10-10-1979 as amended in G. O. 2nd read above.

### AMENDMENT

In the Annexure to the Government order 1st cited against Grade V (a) for "single second class fare plus daily allowance" in column 5 substitute "single first class fare plus daily allowance"

(By order and in the name of the Governor of Andhra Pradesh)

R. K. R. GONELA
Secretary to Government

